కొత్తపల్లి పిల్లల కథల పుస్తకం-62 జులై 2013

**మూలం: http://kottapalli.in/2013/07/welcome**

**మొత్తం ప్రతుల సంఖ్య:** 2000

**సంపాదకులు:** నారాయణ

**ముఖచిత్రం 'బళ్ళు తెరిచారు':** వీరాంజనేయులు

**అక్షర కూర్పు:** *కొత్తపల్లి*

**వెల: రూ.25/-**

ఇంటర్నెట్‌లో ఈ పుస్తకాన్ని వివిధ ఫార్మాట్లుల్లో ఉచితంగా చదవవచ్చు, డౌన్లోడు చేసుకోవచ్చు, అవసరమనిపిస్తే మీ వాణిజ్యేతర కార్యక్రమాలకోసం మీ అంతట మీరే దీన్ని ముద్రించుకోవచ్చు!



కొత్తపల్లి ప్రచురణలు

యంఆర్‌వో ఆఫీసు దగ్గర, చెన్నేకొత్తపల్లి- 515 101, అనంతపురం జిల్లా.

ఫోను: 7702877670 ఇ-మెయిలు: team@kottapalli.in




# విషయ సూచిక

# చెట్లు నాటే కాలం

వానలు పడటం మొదలైంది.

వాతావరణం అంతా చల్లబడ్డది.

ఎండలతో అట్టు ఉడికినట్లు ఉడికిపోయాం, ఈ ఎండాకాలం అంతా. ఒక్కోచోట యాభై డిగ్రీల సెంటీగ్రేడు ఉష్ణోగ్రత నమోదైంది, మరి!

అయితే వానాకాలం మొదలైందో, లేదో- ఒక్కసారిగా చల్లటిగాలులు వచ్చేశాయి- మబ్బుల్ని వెంటబెట్టుకొని. ఉరుములు- మెరుపులు! చిటపటమంటూ చినుకులు! ఫెళఫెళమంటూ వానలు!

అంతలోనే ఉత్తరాన హిమాలయాల్లో పడ్డ వర్షాలకు నదులన్నీ ఉరకలెత్తాయని, కొండ చరియలు విరిగి పడుతున్నాయని, యాత్రలకని వెళ్ళిన వాళ్ళు చాలా మంది అక్కడే ఇరుక్కు పోయారనీ వార్తలు. పాపం ఎందరికో అనుకోని కష్టాలు...

"అబ్బ! నాలుగు రోజులౌతున్నది- సూర్యుడి దర్శనమే లేదు! ఎడతెరపి లేకుండా వానలు! బాగుంది- ఇట్లా పడాలి" అంటున్నాడొక చోట రైతు...

"ఇంకా వానలు బాగా పడనే లేదే?! వాతావరణం చల్లబడ్డది కానీ వానలు లేవే?!" కంగారుగా అంటున్నాడొక ప్రాంతపు రైతు..

"రాబోయే నెల రోజుల్లో రాష్ట్రమంతటా విస్తారంగా వానలు పడతాయి" చెబుతున్నాడో వాతావరణ శాస్త్రజ్ఞుడు...

ఈలోగా అన్ని ఊళ్ళలోనూ చెట్లు పచ్చ పచ్చగా మారాయి. లేత లేత ఆకులు వేశాయి. మల్లె చెట్లు మొగ్గలు తొడిగాయి. జాజిపూల పందిర్లు నిండా పూలతో కళకళలాడటం మొదలుపెట్టాయి.

గులాబీలు, పారిజాతాలు, నిత్యమల్లెలు- అన్నీ వచ్చేశాయి ఒక్కొటొక్కటిగా. పక్షులు రోజూ పోటీ పడి కూస్తున్నాయి.

పశువులిప్పుడు ఇష్టంగా పోతున్నాయి అడవి వైపుకు- వాటికి కడుపునిండా మేసేందుకు పచ్చగడ్డి దొరుకుతుంది కదా, ఇకమీద- అందుకని! రైతులందరూ విత్తనాలు సిద్ధం చేసేసుకున్నారు. నేల 'పదును' అయ్యిందోలేదో చూసుకొని విత్తుతున్నారు.

ఇప్పుడు మనం కూడా ఎక్కడైనా చెట్లు పెట్టొచ్చు. ఎక్కడ పెట్టిన చెట్టు అక్కడే నిలద్రొక్కుకుంటుంది. నిజంగానే ఇది చెట్లు నాటే కాలం! ఇంతకాలమూ ఎండిపోయి ఎడారిలాగా పాడారిపోయిన నేలలన్నీ ఇప్పుడు "రండి! రండి! చెట్లు నాటండి" అని పిలుస్తాయి మనల్ని. ఈ సమయంలో మనకు చేతనైనన్ని విత్తనాల్ని, చేతనైనన్ని మొక్కల్ని పట్టుకెళ్ళి, "ఖాళీగా ఉన్నాం, రండి!" అని ఆహ్వానించే నేలల్ని ఎక్కడికక్కడ నింపేయాలి.

ఇప్పుడు ఎన్ని మొక్కల్ని నాటితే రేపు అన్ని పూలు పూస్తై;ఎల్లుండి అన్ని కాయలు కాస్తై; తర్వాత మళ్ళీ అన్ని చెట్లు తయారయి, వేడెక్కిన వాతావరణాన్ని చల్ల బరుస్తై! వేడి ఎక్కువ అయితే ఒకవైపున హిమానీ నదాలు కరుగుతాయి; నదులు పొంగుతాయి; వరదలు వస్తాయి; మరో వైపున త్రాగేందుకు నీళ్ళుండవు, నిల్చునేందుకు నీడ ఉండదు.

వాతావరణం చల్లగా ఉంటేనే మనమూ చల్లగా ఉంటాం! అందుకని పదండి, మరి! చెట్లు నాటుదాం! చల్లగా ఉందాం!!

కొత్తపల్లి బృందం

## ప్రాణాధారం నీరు- కలుషితమైతే కన్నీరు!



# నీతి చంద్రిక

విగ్రహం-19

*జరిగిన కథ: కాకిని నమ్మవద్దంటూ గుడ్లగూబల కథ చెబుతుంది చక్రవాక మంత్రి. కానీ హంసరాజు దాని భయాల్ని కొట్టి పడేస్తుంది- 'అవసరార్థం శత్రువులతో కూడా సహవాసం చేయచ్చు- కానీ జాగ్రత్తగా ఉండాలి ' అంటూ తెలివైన ఎలుక ఒకటి ఏం చేసిందో చెబుతోంది- ఇక చదవండి, నీతి చంద్రిక 43 వ భాగం...*

*మూలం: కందుకూరి వీరేశలింగం* *సరళీకరణ: ఘడియారం వేంకట నారాయణ శర్మ*

## పిల్లి-ఎలుకల కథ

పంచవటీ ప్రాంతంలోని ఓ మర్రి చెట్టు తొర్రలో రోమశుడు అనే పిల్లి ఒకటి నివసిస్తూ ఉండేది. ఆ చెట్టు క్రిందే ఉన్న కలుగును ఇల్లుగా చేసుకొని 'పలితుడు' అనే ఎలుక ఒకటి నివసించేది.

ఒక రోజు రాత్రిపూట బోయవాడొకడు వచ్చాడక్కడికి. ఎవరూ గమనించటం లేదని నిర్ధారించుకొని, వాడు ఆ చెట్టు చుట్టూ వల పన్ని పోయాడు. పిల్లికి ఆ సంగతి తెలీదు కదా, అది ఇంకా తెల్లవారకనే లేచి ఆహారానికి పోబోయి, ఆ వలలో చిక్కుకున్నది.

ఎలుక దాన్ని చూసి చాలా సంతోషపడింది. ఇంతకాలమూ పిల్లి భయంతో అది నిద్రలేని రాత్రులు గడుపుతూ ఉండింది. 'ఇప్పుడు తనకు పిల్లి పీడ వదిలిపోనున్నది గదా' అని అది నిర్భయంగా కలుగులోంచి బయటికి వచ్చి, ఆ ప్రాంతాల్లో అటూ ఇటూ తిరుగాడటం మొదలుపెట్టింది.



అట్లా ఊరికే తిరుగుతున్న ఎలుకను చూసింది, చంద్రకుడు అనే గుడ్లగూబ. దాన్ని చూడగానే గుడ్లగూబకు నోరూరింది. అది రయ్యిమని ఎగిరి వచ్చి దగ్గరలోనే ఉన్న మరొక చెట్టు మీద వాలింది. దాన్ని చూడగానే ఎలుకకు కాళ్ళు చచ్చుపడ్డట్లయింది; ఒళ్ళు గడ గడా వణికినట్లయింది; గుండె ఝల్లుమన్నది; శరీరం మొత్తం మొద్దుబారిపోయింది.

అలా నిశ్చేష్టం అయిపోయిన ఎలుక త్వరలోనే తెలివి తెచ్చుకొని, తనలో తాను "అయ్యో! ఏమి చేయాలి? ఇంత చక్కటి ఈ శరీరాన్ని ఇన్నాళ్ళూ ఇంత బలంగా పెంచి, చివరికి గూబ పొట్టపాలు చేయాల్సి వస్తున్నదే?! దేవుడా! నాలాంటి బక్కజీవి ప్రాణం నీ కంటికీ ఆనలేదా? నా ప్రాణాలు తీసేందుకేనేమో, విధి నన్ను ఇక్కడికి తెచ్చింది. విధి వ్రాతను తప్పించుకోవటం ఎవరికి సాధ్యం? అడవిలో ఊరికే పండ్లు, వేర్లు తింటూ జీవిత యాత్ర గడుపుతానే, ఇతరులకు ఎవ్వరికీ ఏ చిన్న కీడూ ఎంచని నాకు ముసలితనంలో ఇలా కాని చావు ఎందుకు రాసిపెట్టింది? దేవుడి శక్తి అపారం. ఒక్క నిముషం క్రితమే కదా, 'ఈ పిల్లి పీడ ఇవాల్టితో విరగడౌతున్నది; ఇక హాయిగా ఉండొచ్చు' అని అంత సంతోషించింది?! ఇంతలోనే నాకు అకాల మృత్యువు ఎదురవుతున్నది, చూడు! నేనిక ఏమి

చేయను? ఎక్కడికి పోను?" అని ఏడ్చింది కొంతసేపు.

అట్లా గుండెలు అవిసేట్లు ఏడ్చేసరికి, దాని శరీరం అంతా బలహీనం అయి నీరసించి పోయింది. చివరికి అది కొంత ధైర్యం తెచ్చుకొని, "ఆపద ఎదురైనప్పుడు తెలివి గలవాడు ఏదో ఒక మార్గాన్ని వెతికి ఆపదనుండి తప్పించుకునే ప్రయత్నం చెయ్యాలి తప్ప, ఇట్లా నోరు తెరచుకొని ఆకాశంకేసి చూస్తూ నీరసించిపోకూడదు. ఇప్పుడు నాకు ఈ పిల్లి ఒక్కటే శరణ్యం అనిపిస్తున్నది. ఏదో ఒక మాయోపాయం పన్నాలి- ఇతని దయను సంపాదించుకోవాలి. వేరే మార్గం లేదు" అనుకున్నది.

పని ఎట్లా నెరవేరుతుందో కొంచెం సేపు ఆలోచించుకొని, ఆ ఎలుక బయలుదేరి పిల్లి వైపుకే నడుస్తూ "ఓ పిల్లి రాజా! నమస్కారం. ఎంతో కాలంగా మనం ఇద్దరం ఈ చెట్టునే ఆశ్రయించుకొని సహోదరులలాగా మసలాము. అట్లాంటి మనం, ఇలా కష్టకాలంలో ఒకరికొకరం శత్రువులలాగా ఉండటం సరి కాదు. నాకు నువ్వుకాని, నీకు నేను కాని ఏనాడూ ఒక్క చిన్న కీడుకూడా తలపెట్టి ఎరుగము. నీకు-నాకు పరస్పర ద్వేషం ఉండటానికి కారణం అంటూ అసలు ఏదీ లేనే లేదు...



మనం అందరం ఏదో ఒకనాడు చనిపోయేదే- ఉన్నట్లు ఉంటాం, ఆపైన ఎప్పుడోఒకప్పుడు మృత్యువు వచ్చి నోట కరచుకొనిపోతుంది. ఈ ఉండేది ఎన్నాళ్లయితే అన్నాళ్ళు, మనం ఇద్దరం ఒకరి పట్ల ఒకరం స్నేహాన్ని అవలంబించి, ఒకరికొకరు సహాయం చేసుకుంటూ జీవించటం సబబు. నువ్వు

ఇట్లా వలలో చిక్కుకొని కనబడ్డప్పటినుండి, సహవాస దోషమేమో, ఏమి చెప్పను- నా మనసు నిప్పుల్లో చెరిగినట్లు కణకణ మండుతున్నది- నిజం! మనసులోని మాట ఆ దైవానికే ఎరుక. ఇన్ని మాటలెందుకు? నిన్ను ఈ మృత్యుపాశం నుండి కాపాడేంత వరకు నామనసుకు కుదురు అనేదే ఉండదు. అయినా, పుణ్యానికి పోతే పాపం ఎదురైందన్నట్లు, 'నిన్ను కాపాడటానికి పోతే నా ప్రాణానికి ఎక్కడ ముప్పు వస్తుందో' అని నా మనసే నన్ను ముందుకు పోనివ్వక బంధం వేస్తున్నది.

అది అట్లా ఉండగానే- అదిగో- పాపిష్టి గూబ ఒకటి నన్ను నోట్లో వేసుకుందామని పూనుకొని, అటూ -ఇటూ తిరుగుతూ, నా ప్రక్కన కొండలాగా ఉన్న నిన్ను చూసి ముందుకు దూకేందుకు తటపటాయిస్తూ, తల వంచుకొని, మనసు చలించగా, వేడి వేడి నిట్టూర్పులు విడుస్తూ కూర్చొని ఉన్నది. నీ దయ ఉంటే నాకొచ్చిన ఆపదనుండి తప్పించుకొని- అటుపైన నీ ఆపదనుండి నిన్ను తప్పించేందుకు ప్రయత్నిస్తాను నేను. వేరుగా చూడక, నన్ను నీ మిత్రుడిగా స్వీకరించు" అన్నది.

ఆ మాటలు విని పిల్లికి చాలా సంతోషం కలిగింది. ప్రాణం లేచివచ్చినట్లయింది దానికి. రెండు చేతుల్తోటీ చెవులు మూసుకొని, అది "అయ్యో! కరుణ గలవారిలో ఉత్తముడా! 'నీ బ్రతుకుకే మోసం వస్తుందేమో' అని ఎంత మాట అన్నావు?! ఊరికే ఉపకారం చేసేందుకు వచ్చిన నీలాంటి మూగ ప్రాణులను నా యీ పాడు పొట్టకోసం చంపి, ఇక నేను ఏమి మూట కట్టుకుంటాను? దేనికి భయపడినా భయపడకపోయినా- కనీసం పాపానికన్నా భయపడాలి కదా? నేను ఇప్పుడు 'నావారు' అంటూ ఎవ్వరూ లేని దశలో మ్రగ్గిపోతూ, కాటికి కాళ్ళు చాచుకొని ఉన్నాను. ఈ పరిస్థితుల్లో ఎంత దుర్మార్గుడైనా ధర్మం తప్పి, నీతి మాలిన పనికి పూనుకుంటాడా?

'ఇతరులు ఏమి చేస్తే తన మనసుకు అయిష్టమవుతుందో, అట్లాంటి పనులు తాను ఇతరులకు చేయకుండా ఉండటం'- అదే కదా

పరమ ధర్మమూ, సర్వశాస్త్రసారమున్నూ?

నేను కూడా చిన్ననాటినుండి నీవంటి పెద్దల శిక్షణలో పెరిగినవాడినే తప్ప, వివేకం తప్పి ప్రవర్తించినవాడిని కాదు.

మిత్రమా! నీ దర్శనం వల్ల నాలోని అజ్ఞానం అంతా పటాపంచలై పోయింది. నేను ఎప్పుడూ నీ పొందుకోసమే గుటకలు మ్రింగుతూ ఉంటాను. నేటికి అది, ఈ విధంగా నెరవేరుతున్నది. నీ స్నేహాన్ని పొందిన ధన్యుడు పరమ పుణ్యాత్ముడు కాక ఇంకేమి అవుతాడు? నీ సహచర్యంతో వెయ్యి మంది బంధువులు వచ్చి తోడుగా నిలబడ్డట్లున్నది.

లోకంలో మంచివారికి సజ్జన దర్శనాన్ని మించి సంతోషాన్నిచ్చేది వేరే ఏమున్నది? 'ఇతరు-లకు మేలు చేద్దాం' అన్న నీ ఆలోచనతో నా మనసు పూర్తిగా ఏకీభవించింది. మనం చేసిన మంచి పనులే మనల్ని కాపాడతాయి.

కాబట్టి, బుద్ధిమంతులు కాలు-చెయ్యి ఆడేనాడే ధర్మం గురించి ఆలోచించాలి. అటు తర్వాత జవ సత్వాలు ఉడిగాక, శరీరంలో కేవలం ఎముకలు, చర్మం మాత్రమే మిగిలాక, ముసలితనం వచ్చేశాక ఇక ఏం చేయాలన్నా వీలవ్వదు. మన ఈ ఆయుష్షు అన్నది తుఫానులో ఉంచిన దీపం మాదిరి, ఎప్పుడు ఆరిపోతుందో తెలీనట్లు క్షణక్షణమూ కొట్టు మిట్టాడుతూ ఉంటుంది. అది తెలుసుకొని, రేపు చేయాల్సిన మంచి పనిని ఇప్పుడు, మరునాడు చేయవలసిన దానిని రేపు-చేస్తూండాలి. 'ధర్మం త్వరగా గడచిపోతుంది' అని చెబుతారు కదా, పెద్దలు?!



దు:ఖ సముద్రంలో మునిగి, దారీ-తెన్నూ తెలీకుండా ఉన్న నాకు నువ్వొక తెప్ప మాదిరి ఎదురుపడ్డావు. ఆహా! ఏమి నా భాగ్యము!

ఆడబోయిన తీర్థం ఎదురైనట్లు అయ్యింది! నేను నీ సహచర్యాన్ని కోరేందుకు తహతహలాడుతుంటే, ఇంతలోనే ఎవరో అడిగినట్లు నీ అంతట నువ్వే నన్ను తరింపజేయాలని ముందుకు వచ్చి నిలచావు.



నీ వంటి పుణ్యాత్ములు ఈ లోకంలోనే ఎవ్వరూ లేరు. నీ అంతటివాడు ఈ గుడ్లగూబని చూసి భయపడేదేమి? నా ప్రాణాలు కాపాడితే చాలు- నువ్వు ఏ పని చెబితే ఆ పని చేస్తాను. భయం విడనాడి నా దగ్గరికి రా. నా స్నేహం ఉండగా నిన్ను ఈ నీచ పక్షి తాకేందుకు కూడా సాహసించదు. నీ ప్రాణానికి నా ప్రాణం అడ్డు వేస్తాను. త్వరగా వచ్చి, ఈ వల పని పట్టు" అన్నది.

పిల్లి మాటలకు ఎలుక సంతోషించి, మెల్లగా ఆ పిల్లి దగ్గరికి పోయింది. అది చూసి, దూరంగా ఉన్న గుడ్లగూబ నిరాశపడి, తనకు ఇక అక్కడ పని లేదనుకొని, తిరిగి చూడకుండా వచ్చిన త్రోవ పట్టింది.

సరిగ్గా అదే సమయానికి బోయవాడుకూడా ఆ ప్రాంతానికి రాసాగాడు. వెంట వేటకుక్కలు నాలుకలు బారచాపి పరుగెత్తుకొని రాగా అతను 'సాక్షాత్తూ యమభటుడేమో' అనిపిస్తున్నాడు.

అతను అలా రావటాన్ని దూరం నుండే గమనించిన పిల్లి గుండెలో రాయి పడ్డట్లయింది. భయంతో వణికిపోతూ అది ఎలుకతో "మిత్రమా! మనం మాటల్లో పడి ఏమారి ఉన్నాం, చూడు-అదిగో- ఆ దారిన వేటగాడు చేతిలో కట్టెను పట్టుకొని యముడిమాదిరి నడచి వస్తున్నాడు. ఆ దుర్మార్గుడు నా కంట పడినప్పటినుండి నా ప్రాణాలు పోయినట్లే అవుతున్నాయి. మనసు

అదుపుతప్పి పోతున్నది. ఇంక నా బ్రతుకంతా నీ చేతిలోనే ఉన్నది. పుట్టి బుద్ధి ఎరిగాక ఇదివరకు ఎన్నడూ నాకు ఇటువంటి కష్టం ఎదురవ్వలేదు. సమయం గడిచిపోతున్నకొద్దీ నాలో అసహనం ఎక్కువైపోయి, భయంతో ఒళ్ళు కంపిస్తున్నది. నన్ను ఆ క్రూరుడి చేతిలో చిక్కనివ్వకు. త్వరగా విడుదల చెయ్యి- త్వరపడు!" అని తొందరచేసింది.

ఎలుక మాత్రం వల చుట్టూ తిరుగుతూ, త్రాళ్ళు కొరుకుతున్నట్లు నటిస్తూ, 'భయపడకు, భయపడకు- ఇదిగో విడిపిస్తున్నాను' అంటూ వేటగాడు మరింత దగ్గరయ్యేంత వరకూ గడిపింది. అటుపైన, వాడు మరీ దగ్గరికి వచ్చాక గబగబా వల త్రాటిని తెగకొరికి, ఒక్క పరుగున పోయి తన బొరియలో దూరింది.

అంతవరకూ భయంతో నిశ్చేష్టమైపోయిన పిల్లికూడా, ఆ విధంగా వల త్రాళ్ళు ముక్కలవ్వగానే దబదబా తన్నుకులాడి వల నుండి బయటపడింది. అంతలోనే తన ఎదురుగా నోరు తెరచుకొని నిలబడ్డ యమభటుడిలాంటి వేటకుక్కని చూసి, అది మరోసారి వణికి, దగ్గరలో కనబడ్డ చెట్టు మీదికి ఒక్క గెంతున దూకి పరుగుపెట్టింది.



తన ప్రయత్నం విఫలం అవ్వటమే కాక, 'వల కూడా పాడైందేమి?' అని ఆశ్చర్యపడ్డ వేటగాడు ముక్కున వేలు వేసుకొని కొంతసేపు నిలబడి, ఆనక వల త్రాళ్ళు మోసుకొని తన దారిన తాను పోయాడు.

అంతా సద్దు మణిగాక, పిల్లి చెట్టు దిగి వచ్చి ఎలుక కలుగు ముందు నిలబడి "మిత్రమా! ఇంకా కలుగులో దాగి ఉన్నావెందుకు? నీకున్న పరోపకారగుణం వల్ల నావంటి బలవంతుడైన

మిత్రుడు నీవాడయ్యాడు. బయటికి రా! నీ పలుకులతో మరోసారి నా చెవులకు విందు చేయి. ఇవాల్టినుండి నా సంపదలన్నీ నీవి. నీకు పెట్టకుండా ఒక్క మంచి పదార్థంకూడా తినేందుకు నా మనసు అంగీకరించదు. ఇక మీద నాకు చుట్టాలూ పక్కాలూ అన్నీనువ్వే. మా ఇంటిని నీ ఇల్లే అనుకో. నాతోపాటు వచ్చి మాయింటిని పావనం చెయ్యి. ఇవాళ్ళ-రేపు నీ అన్నపానాదులన్నీ మా యింట్లోనే.

ఇదిగో, నా సంపదలు, నా జీవితం అంతా ఇకమీద నీ అధీనం. నన్ను నీవాడనుకో. ప్రాణాలను కాపాడి మహోపకారం చేసిన మిత్రుడిని కృతజ్ఞతా పూర్వకంగాకనీసం కౌగలించుకొని గౌరవించకుండా నా మనసు నిలుస్తుందా? ఇప్పుడు నన్ను ఇంకా దూరంగా ఉంచుతావెందుకు? నీ కలుగులోంచి వేగిరం బయటికిరా, నన్ను అక్కున చేర్చుకొని సంతోషపెట్టు!" అన్నది.

ఎలుక కలుగులోంచే జవాబిచ్చింది: "పని నెరవేరటంకోసం ఒక్కోసారి పగ వానితో స్నేహానికి అంగీకరించినప్పటికీ, తెలివి గలవాడు ఏమారడు. ఇప్పుడు నీ తీపి మాటలకు లొంగి, నీతో చెలిమికి అంగీకరించటం నాకు ప్రాణాంతకమే అవుతుంది. ఇంతవరకూ నువ్వు ఆ వలలో చిక్కుకొని చాలా అలసి ఉన్నావు; బాగా ఆకలిగొని ఉన్నావు. నీ పొట్ట వెన్నును అంటుకొని ఉన్నది. కళ్ళు గుంటలు పడి ఉన్నాయి. నీకిప్పుడు కావలసింది స్నేహం కాదు; ఆహారమే! ఆ ఆహారంకోసం ఇంత స్నేహాన్ని నటిస్తున్నావు. నీ మాయమాటలకు లొంగి ప్రాణాలు కోల్పోమంటావా? నీకు-నీ స్నేహానికీ వెయ్యి నమస్కారాలు. ఇంక నీకిక్కడ వేరే పనిలేదు. స్నేహం పేరిట నేను నీ చేత చిక్కటం జరగదు. భ్రమలన్నీ విడచి నీదారిన నువ్వు పో. ఇంతకు ముందే కదా ఆ వేటగాడి వలనుండి తప్పించుకున్నది? మళ్ళీ ఇంతలోనే ఈ దురాశ అనే వలలో ఎందుకు, చిక్కుకుంటావు?" అని తిట్టి, కలుగులోంచి బయటికి రాక, ఎలుక సుఖంగా ఉన్నది.

ఆ మాటలకు మనసు విరుగగా, పిల్లికూడా చేత చిక్కిన డబ్బును పోగొట్టుకున్న వాడిలాగా

ముఖం చిన్నబుచ్చుకొని చెట్టునెక్కి పోయింది.

కాబట్టి, ఒక్కోసారి శత్రువుతోకూడా మనకు నెరవేరవలసిన అవసరాలు ఉంటాయి. అలాంటప్పుడు ఏమారి ఉండటం మాత్రం మంచిది కాదు. ఈ విషయంలో ఆలోచించవలసింది మరేమీ లేదు.

నువ్వు ఇక బదులు చెప్పకు. ఈసారికి కాకితో మిత్రత్వాన్ని అంగీకరించు" అని, ఇంకా దానికొచ్చిన అనుమానాలన్నిటికీ తగిన జవాబులిచ్చింది హంస.

(తర్వాత ఏమయిందో వచ్చేసారి..)

పాట

పువ్వులున్నాయ్ పువ్వులు!
మల్లెపువ్వులు, మొగలి పువ్వులు
మాలతీ మందార పువ్వులు
పువ్వులున్నాయ్ పువ్వులు!

ఎవ్వరెరుగని తోటనుంచీ
పువ్వులెన్నోకోసి తెచ్చా
పువ్వులున్నాయ్ పువ్వులు!

బాట చివ్వర కోటలో ఒక
చోట చక్కని తోట ఉన్నది
తోట లోపల పూట పూటా
పాట పాడే పిట్టలున్నవి

చెట్టు చెట్టుకు పోయి పిట్టలు
చిట్టి పాటలు పాడగానే
పాటలన్నీ పువ్వులై ఆ
తోటనిండా విరగబూస్తాయ్!
"పువ్వులున్నాయ్ పువ్వులు!

సన్నజాజులు, బొండు మల్లెలు
సాటి లేని గులాబి గుత్తులు
కమ్మ కమ్మని కొమ్మ సంపంగి
గుమ్ముగుమ్మను పొగడ పువ్వులు
పువ్వులున్నాయ్ పువ్వులు..

-నండూరి రామ మోహన రావు



# అసలైన సంపద

*'ఇతరులకు సాయం చేస్తే మన సంపద పదింతలౌతుంది' అని రాస్తున్నాడు అఖిల్. నిజమేనా...?*
*సేకరణ: కె.అఖిల్, ఎనిమిదవ తరగతి, జి.ప్ర.ప. సెకండరీ పాఠశాల, తరాలపల్లి, వరంగల్లు జిల్లా.*

సోమనాథం వట్టి పిసినారి. తిని-తినక చాలా కూడబెట్టాడు.

అంతలో చుట్టు ప్రక్కల ఊళ్ళలో దొంగలు పడుతున్నారని సోమనాథానికి తెలిసింది. 'దొంగలు తమ ఊళ్ళోనూ పడచ్చు! తన ఇంటికే రావొచ్చు!' అని భయం వేసింది సోమనాథానికి. దాంతో తను కూడబెట్టుకున్న సంపదనంతా భద్రంగా దాచి పెట్టాలని నిర్ణయించుకున్నాడు.

భార్య సుగుణను పిలిచి- "మనం సంపాదించిన సంపద మొత్తాన్నీ రెండు భాగాలు చేసి పంచుకుందాం. నేను నా భాగాన్ని నాకు తెలిసిన చోట దాస్తాను. నీ భాగాన్ని నువ్వు నీకు తెలిసిన చోట దాచు. ఒక వేళ దొంగలు పడి మన ఇల్లు కొల్లగొడితే ఒక భాగం పోయినా ఇంకో భాగం దక్కుతుంది"

అన్నాడు.

"మీరు చెప్పినట్టు చేస్తాను; కానీ నా భాగాన్ని నేను ఎక్కడ దాచానో మీరు అడగకూడదు" అంది సుగుణ.



'ఎక్కడైనా దాచి పెట్టనివ్వు, సొమ్ము క్షేమంగా ఉంటే అంతే చాలు' అనుకున్న సోమనాథం, ఆమె షరతుకు ఒప్పుకున్నాడు.

అలా 6 నెలలు గడిచాయి.

అనుకున్నట్లుగానే దొంగల ముఠా కళ్ళు ఊళ్ళోని భాగ్యవంతుల ఇళ్ళన్నిటిమీదా పడ్డాయి. అందరినీ నిలువునా దోచారు. సోమనాథం ఇంట్లో ఉన్న వస్తువులన్నీ దొంగల పాలయ్యాయి. 'పోనీలే, అయినా నేను దాచిన సొత్తంతా భద్రంగా ఉంది కదా!' అనుకొని నిబ్బరంగా ఉన్నాడు సోమనాథం. దొంగలు వెళ్ళిపోయాక తను సంపద దాచి పెట్టిన చోటుకు వెళ్ళి చూస్తే ఏముంది, అక్కడ చిల్లి గవ్వ కూడా లేదు!

సోమనాథం ఘొల్లుమన్నాడు. అంతలో భార్య సుగుణ వచ్చి ఓదార్చింది. ఆయన అడిగాడు భార్యని- "కనీసం నేను నీకు దాచమని ఇచ్చిన సొత్తయినా జాగ్రత్తగా ఉందా?" అని.

"జాగ్రత్తగానే ఉందిలెండి!" అన్నది సుగుణ.

"పద, చూద్దాం!" అని సోమనాథం తొందరపడ్డాడు.

సుగుణ సోమనాథాన్ని ఒక మురికివాడకు తీసుకెళ్ళింది. ఆ వాడ జనం మొత్తం పరుగున వచ్చి వాళ్ళిద్దరికీ మర్యాదలు చేశారు. "అమ్మా, మీరు చేసిన సాయం వల్ల మేము ఇలా చల్లగా బ్రతుకుతున్నాం. మీరు ఇచ్చిన డబ్బుతోనే మేము పొలాలు కొనుక్కొని సాగు చేసుకుంటున్నాం. మా పిల్లలు చదువుకుంటున్నారు; ఉద్యోగాలు చేస్తున్నారు. మా మాట ప్రకారం మేము ప్రతి నెలా మీకు కొంత డబ్బు, అలాగే పంటలో

వాటాగా సంవత్సరానికి ఇంత ధాన్యం పంపిస్తాం" అన్నారు.

వాళ్ళ అభిమానం, గౌరవ మర్యాదలు చూసిన సోమనాథం కళ్ళు చెమ్మగిల్లాయి. "నేను దాచింది దొంగల పాలైంది, కాని నువ్వు దాచినది పదింతలై మనకు మంచి చేస్తోంది. ఒకప్పుడు సంపాదించడమే గొప్ప అనుకున్నాను. కానీ 'ఇతరులకు సహాయపడడం అంతకంటే గొప్ప' అని తెలియజేశావు నువ్వు. అసలైన సంపదంటే ఏమిటో ఇప్పుడు తెలిసి వచ్చింది నాకు!" అన్నాడు సోమనాథం, విప్పారిన ముఖంతో.

భర్తలో వచ్చిన మార్పును చూసి సుగుణ ఎంతో ఆనందించింది.

నవ్వండి!

**చాలా పూర్!**

రాం: నువ్వేమైనా విదేశాలు చూసావా?

వాసు: లేదు. నేను చాలా పూర్!

రాం: అయితే సింగపూర్ వెళ్ళి రావచ్చుగా..?

**తెలీదు!**

రవి: డ్రైక్లీనింగ్ అంటే ఏంటిరా?

సోమేష్: బట్టల్ని ఉతక్కుండా ఎండలో ఆరబెట్టటం అయ్యుంటుందిరా!

**వేరేవాడి సమస్య!**

విలేకరి: మీకు ఫైటింగ్ సీన్లంటే ఎందుకు అంత ఇష్టం?

హీరో: అవన్నీ నేను చేయక్కర్లేదుగా, డూప్ చేస్తాడు, అందుకని!




# మారు అడక్కూడదు

*మామూలుగా అయితే మారు అడగొచ్చు, కానీ ఇట్లాంటి ప్రత్యేక సందర్భాలలో మటుకు నాలుకని అదుపు చేసుకోవాల్సిందే..ఇదిగో, చదవండి దశాని పంపిన హాస్యకథ..*
*సేకరణ: ఎం.దశాని, పదవ తరగతి, రిషీవ్యాలీస్కూల్, మదనపల్లి.*

రత్నపురం అనే పల్లెటూళ్ళో ఒక చిన్న పెంకుటింట్లో కాపురం ఉండేవారు, సుబ్బారావు అతని భార్య సూర్యకాంతం. సుబ్బారావు ఆ ఊరి బళ్లో మాష్టారు- గొప్ప శాంత స్వభావి. అయితే ఆయన భార్య సూర్యకాంతం మాత్రం నిజంగా సూర్యకాంతమే: పరమ గయ్యాళి. భర్త ఏం చెప్పినా వినేది కాదు; ఎప్పుడూ పొరుగు వాళ్ళతో తగాదా పడటం, ఒకళ్ళ మీద ఒకళ్ళకి పుచ్చులు చెప్పడంతో సమయం గడిపేది. అయితేనేమి, ఆమె చేసే గుత్తివంకాయ కూర అంటే మటుకు సుబ్బారావుకు ప్రాణం. అది

లేకుండా తను ఉండలేడు!

ఒక రోజు సుబ్బారావు చాలా కంగారు పడుతున్నాడు.

"ఏంటండీ, అంత కంగారుగా ఉన్నారు?" అంది సూర్యకాంతం, రెండు ఇడ్లీలు పెట్టి కాస్త పచ్చడి విదిలిస్తూ.

సుబ్బారావు కోప్పడకుండా "ఈ రోజు స్కూలు ఇన్స్పెక్టర్ రామారావు గారు వస్తున్నారు..." అని ఇంకేదో చెప్పబోయాడు. ఆయన చెప్తున్నది వినిపించుకోకుండా బయట ఏవో మాటలు వినబడుతుంటే అటు పరిగెత్తింది సూర్యకాంతం.

'ఈసారైనా హెడ్ మాష్టర్‌గా ప్రమోషన్ ఇప్పించమని ఇన్స్పెక్టర్ని అడగాలి' అనుకుంటూ బడిని చేరాడు సుబ్బారావు. తరగతి గదిలో పిల్లలకి హాజరు వేయసాగాడు-

"లక్ష్మి!"

"ఎస్ సర్!"

"బాలూ!"

"ఎస్ సార్!"

"వినయ్..!"

హఠాత్తుగా పిల్లలందరూ లేచి నిలబడ్డారు. "ఏమయిందిరా?" అని సుబ్బారావు అడిగేలోపు ఇన్స్పెక్టర్ రామారావు లోపలకి వచ్చేశాడు.

"ఇహిహి. రండి సార్. మీ కోసమే ఎదురు చూస్తున్నా" అన్నాడు సుబ్బారావు. "ఇదిగో లక్ష్మి! సార్ కి మంచినీళ్ళు తీసుకురా" అని పురమాయించి, సారుకు కుర్చీ చూపించాడు.

"ఈ మర్యాదలు సరేనయ్యా! ఏదీ ఈ పాఠం చెప్పు. ఎలా చెప్తావో చూద్దాం" అన్నారు ఇన్స్పెక్టర్ గారు విసుగ్గా, లక్ష్మి తెచ్చిన మంచినీళ్ళు తాగుతూ.

సుబ్బారావు పాఠం చెప్తుండగా ఆయన తన నోట్ బుక్ లో ఏవేవో రాస్తున్నారు.

సుబ్బారావు చిన్నపిల్లాడిలాగా 'ఎప్పుడెప్పుడు సాయంత్రం గంట మోగే టైం అవుతుందా' అని ఎదురు చూస్తూ ఉన్నాడు.

ఆఖరికి గంట మోగింది. పిల్లలందరూ

వెళ్ళిపోయాక, సుబ్బారావు ఇన్స్పెక్టర్ గారిని తన ఇంటికి రాత్రి భోజనానికి రమ్మని ఆహ్వానించాడు.

"నేను అలా ఊరంతా తిరిగి చూసి వస్తాను. ఈలోపు అన్ని ఏర్పాట్లూ పూర్తి చేసుకోండి!" అంటూ రచ్చబండవైపు వెళ్ళారు ఇన్స్పెక్టర్ గారు.

అప్పుడు గుర్తొచ్చింది సుబ్బారావుకు- ఇంట్లో ఉన్నది సూర్యకాంతం! ఆమెకి తను ఈ వంట సంగతి ఇంకా చెప్పలేదు! చేస్తుందో, చెయ్యదో, ఏమంటుందో?! 'వంట చేయడానికి తనను ఎలా ఒప్పించాలా' అని ఆలోచిస్తూ ఇంటివైపు వేగంగా నడిచాడు సుబ్బారావు.

"ఏమేవ్! ఒకసారి ఇలా రా. నీతో ఒక ముఖ్య విషయం చెప్పాలి" అన్నాడు.

పక్కింటి రాములమ్మతో మాట్లాడుతున్న సూర్యకాంతం విసుక్కుంటూ "ఏమిటో అంత ముఖ్య విషయం" అంది చేతులు ఊపుకుంటూ బయటే నిలబడి.

అయితే సుబ్బారావు అదృష్టం కొద్దీ రాములమ్మ తన ఇంటికి వెళ్ళిపోయింది- సూర్యకాంతం లోపలకి వచ్చింది.

"ఇంకాసేపట్లో ఇనస్పెక్టర్ గారు మనింటికి భోజనానికి వస్తున్నారు" అన్నాడు సుబ్బారావు, నిబ్బరంగా.

"వస్తే ..? మీరే వండుకోండి- నా వల్లకాదు, ఇప్పటికిప్పుడు వంటలు చేయాలంటే!" అంది సూర్యకాంతం తటాలున.

"అది కాదే, ఈరోజు నువ్వు గుత్తి వంకాయ కూర చెయ్యి. ఎన్నాళ్ళుగానో ప్రమోషన్ అడుగుదామనుకుంటున్నాను కదా! ఇప్పుడు నీ వంకాయ కూర తిన్నాడంటే ప్రమోషన్ గ్యారంటీగా ఇచ్చేస్తాడు" అన్నాడు సుబ్బారావు మెత్తగా.

"మీకు ప్రమోషన్ రావడానికి నేను వంకాయ కూర వండాలా, నాకేం లాభం?" అంది సూర్యకాంతం పళ్ళు బిగబట్టి.

"ఈ ఒక్కసారీ నా మాట వినవే, ఈ ప్రమోషన్ కోసం ఎన్నాళ్ళుగానో ఎదురు చూస్తున్నాను.

నాకు ప్రమోషన్ రాగానే కంచి నుండి రెండు పట్టు చీరలు తెప్పిస్తానులే, నీకు!" అన్నాడు సుబ్బారావు, చివరి అస్త్రం ప్రయోగిస్తూ.

మొదటి మాటకి ముఖం తిప్పుకున్న కాంతం, 'పట్టు చీరలు' అనగానే ఇటు తిరిగింది- "సరే! నేను వంకాయ కూర చేస్తాను. అయితే ఇంట్లో నాలుగు కాయలే ఉన్నాయి. మొదట ఆయనకొకటి, మీకొకటి వేస్తాను. నేను చేసిన కూర ఆయనకి తప్పకుండా నచ్చుతుంది, కనక మారు అడుగుతారు; వేస్తాను. మీరు మటుకు మారు అడగకూడదు. మిగిలే ఆ ఒక్క వంకాయా నాది. నా వంకాయని మీరు గనక మారు అడిగారో- నేనేం చేస్తానో నాకే తెలియదు-జాగ్రత్త!" అంది.

"నేను మారు అడగనే అడగను. నీ వంకాయ నువ్వే తిందువు గాని!" అన్నాడు సుబ్బారావు, ఎట్లాగో భార్య వంట చేయడానికి ఒప్పుకున్నది కదా అని పొంగిపోతూ.

అన్నట్లే సూర్యకాంతం నాలుగు వంకాయలతో గుత్తి వంకాయ కూర వండింది. వంట వాసనతో ఇల్లంతా ఘుమఘుమలాడింది. ఇన్స్పెక్టర్ గారు రాత్రి భోజనానికి వచ్చారు. కాంతం దీపం వెలిగించి నట్టింట్లో పెట్టింది. కాసేపు కబుర్లు చెప్పుకున్నాక, ఇన్స్పెక్టర్ గారిని భోజనానికి లేవమన్నాడు సుబ్బారావు.

అతిథి చేతులు కడుక్కోవడానికి బక్కెట్లో నీళ్ళు తెచ్చి పెరట్లో పెట్టింది సూర్యకాంతం. అక్కడ కాస్తంత కూడా వెలుగు లేదు. ఎలాగో చేతులు కడుక్కుని భోజనానికి కూర్చున్నారు సుబ్బారావు, ఇనస్పెక్టరూ.

సూర్యకాంతం వడ్డించింది. వంకాయ కూరని మెచ్చుకుంటూ తింటున్న ఇనస్పెక్టర్ని చూస్తే సుబ్బారావుకి చాలా ఆనందంగా ఉంది- 'ప్రమోషన్ తప్పకుండా ఇస్తాడు. మా కాంతం గుత్తి వంకాయ కూర తింటే ఇక అంతే, మనం చెప్పినట్లు వింటారు ఎవరైనా' అని అనుకుంటూ 'మారు అడక్కూడదు' అన్న సంగతి మర్చిపోయాడు!

ఇన్స్పెక్టర్ గారికి మారు వేసినప్పుడు తను కూడా మారు వేయించుకున్నాడు సుబ్బారావు: పళ్ళు కొరుక్కుంటూ వడ్డిస్తున్న సూర్యకాంతాన్ని అసలు చూడనే లేదు!

ఇద్దరూ భోజనాలు ముగించి, చేతులు కడుక్కోవడానికి లేచారు.

ముందుగా చేతులు కడుక్కోవడానికి ఇనస్పెక్టర్ గారు వచ్చారు. చీకట్లో ఏమీ కనబడటం లేదు. అంతలో బరువైన వస్తువేదో ఆయన నెత్తిమీద ఠపాలుమని పడింది- ఆ వెంటనే మళ్ళీ.. మళ్ళీ! నక్షత్రాలు కనిపించినై ఆయన కళ్ళకి!

"నాకు లేకుండా కూర అంతా తినేస్తావా! మారు అడగనని చెప్పి మారు అడుగుతావా! మారు అడుగుతావా!" అంటూ ఇత్తడి చెంబుతో నెత్తి మీద మొట్టికాయలు వేసింది కచ్చగా సూర్యకాంతం, ముందుగా చేతులు కడుక్కునేందుకు వచ్చింది సుబ్బారావు అనుకుని.

ఆవిడ దెబ్బలకి అదిరిపోయిన ఇన్స్పెక్టర్ గారు ఒక్క పరుగున వీధిలోకి వచ్చిపడ్డారు.

"ఏమయింది సార్? ఆగండి సార్! ఆగండి సార్!" అంటూ సుబ్బారావు అతని వెంట పడ్డాడు.

కానీ ఏం లాభం? జరగవలసిన అనర్థం జరిగిపోయింది. ఇప్పుడు సుబ్బారావు ప్రమోషన్ గాలిలో కలిసిపోయినట్లే!

**నరవానరం!**

టీచరు: నరుడికి వానరుడికి తేడా ఏంటిరా?

విద్యార్థి: 'వా' సార్!

నవ్వండి!

**అర్థ తెలివి!**

టీచరు: అర్థరాత్రికి వ్యతిరేకపదం ఏంటిరా?

విద్యార్థి: అర్థ పగలు సార్!

**నిలువెక్కడ?!**

హెడ్మాస్టరు గారు: అడ్డగాడిదలు ఎక్కడుంటాయి?

మాస్టారు: కాలేజీలో బ్యాక్ బెంచీలో ఉండి కూస్తుంటాయి!




# ముసలాయన - ఆవు

*మన పని మనం చేసుకోవటాన్ని మించింది వేరే ఏదీ లేదు. ఇదిగో, ఈ కథలో ముసలాయన కోరిక చివరికి అట్లాగే నెరవేరింది... !*

*కథనం: ఎన్. స్వర్ణలత, 8 వ తరగతి, జి.ప్ర.ప. సెకండరీ పాఠశాల, తరాలపల్లి, వరంగల్లు (జిల్లా)*

అనగనగా ఒక ముసలాయన ఉండేవాడు.

అతని దగ్గర ఒక ఆవు ఉండేది.

ముసలాయన చాలా పేదవాడు. ఒక సంవత్సరం వానలు సరిగ్గా పడలేదు. ముసలాయనకి రోజులు గడవటం కష్టమైంది.

చేసేది లేక, ఆ ఆవును అమ్మేందుకు సంతకి బయలు దేరాడు.

సంతకి వెళ్ళే దారిలో ఒక కాలువ ఉన్నది. దానిని దాటడానికి ఇష్టపడలేదు ఆవు.

దానిని ఎంత బ్రతిమిలాడినా ప్రయోజనం లేక పోయింది. ఆవు జానెడంత కూడా కదల్లేదు.

విసుగు వచ్చేసింది ముసలాయనకి. అటూ

ఇటూ చూస్తే అతనికి దూరంగా నిలబడి ఇటే చూస్తున్న కుక్క ఒకటి కనిపించింది.

ఆయన ఆవును అక్కడే వదిలేసి కుక్క దగ్గరికి వెళ్ళాడు. వెళ్ళి, "కుక్కా! కుక్కా! నువ్వొచ్చి నా ఆవును కరువు, అది కాలువ దాటిపోతుంది!" అన్నాడు.

కుక్క ఒప్పుకోలేదు. "పాపం! ఆ ఆవుని కరవటం ఎందుకు, అనవసరంగా?" అనుకున్నది.

అంతలో కాలవ ఒడ్డున ఒక కర్ర కనిపించింది ముసలాయనకు.

"ఈ కుక్క ఎంతకీ మాట వినటం లేదు. దీని పని చెప్పాలి" అనుకొని అతను కర్ర దగ్గరికి వెళ్ళాడు.

"కర్రా! కర్రా! రా! కుక్కను బాదు! నువ్వు బాదితే, అప్పుడు కుక్క వచ్చి ఆవును కరుస్తుంది; ఆవు కాలువ దాటుతుంది" అన్నాడు.

కర్ర ఎందుకు కదులుతుంది? అది అస్సలు కదలలేదు.

ముసలాయనకి ఇప్పుడు కర్ర మీద కూడా కోపం వచ్చింది. అటూ ఇటూ చూసే సరికి, అక్కడికి దగ్గర్లోనే చీమల పుట్ట ఒకటి కనిపించింది. చీమలన్నీ హడావిడిగా అటూ ఇటూ తిరుగుతున్నాయి- ఏవేవో మోసుకొస్తున్నాయి.



ముసలాయన చీమల దగ్గరికి వెళ్ళి-

"చీమల్లారా! చీమల్లారా! మీరు పోయి కర్రను కొరకండి; అప్పుడు అది పోయి కుక్కను కొడుతుంది; కుక్క పోయి ఆవును కరుస్తుంది; ఆవు కాలువ దాటుతుంది!" అని చీమల్ని అడిగాడు.

కాని చీమలు కూడ ఒప్పుకోలేదు. 'చేస్తున్న పనిని ఆపి ఊరికే కర్రను ఎందుకు కొరకాలి, మేం కొరకం!' అనుకున్నాయి.

ముసలాయనకు చీమల మీద కోపం వచ్చింది. అంతలో అక్కడ గింజల్ని ఏరుకుంటున్న కోడి ఒకటి కనబడింది ఆయనకు. 'వీటి పని చెబుతాను ఆగు!' అని, కోడి దగ్గరికి వెళ్ళాడు. "కోడీ, కోడీ, చీమలను తినెయ్యి. అప్పుడు అవి పోయి కర్రను కొరుకుతాయి; కర్ర పోయి కుక్కను కొడుతుంది; కుక్క పోయి ఆవును కరుస్తుంది; అప్పుడు ఆవు కాలవ దాటుతుంది" అని బ్రతిమిలాడాడు.

కానీ కోడి "కొక్కొక్కొక్కొ" అంటూ దూరం పారిపోయింది.

ఇంక ఇప్పుడేం చేయాలి? ఇంకేమీ చెయ్యలేక, ముసలాయన "వీటిని బ్రతిమిలాడడం ఎందుకు? నేనే ఈ కర్రతో కొట్టి కాలువ దాటిస్తాను చూడు' అని కట్టెతో ఆవును గదమాయించాడు. వెంటనే ఆవు కాలువ దాటింది.

సొంతగా పని చేసుకోటాన్ని మించింది వేరే ఏదీ లేదు!

**పుస్తక స్నానం!** నవ్వు!

ఒకసారి వెంగళప్ప వ్యవసాయ అధికారిగా ఉన్న కాలంలో ఆయనకొక ఫోను వచ్చింది:

ఫోనులో వ్యక్తి: మా యింట్లో ఉన్న వ్యవసాయ పుస్తకాలకు బాగా చెదలు పడుతున్నాయి. ఏం చేయమంటారు?

వెంగళప్ప టక్కున జవాబిచ్చాడు: మలాథియాన్ పురుగుమందు వంద మిల్లీ లీటర్లకు గాను నూరు లీటర్లు నీళ్ళు కలిపి పిచికారీ చెయ్యండి!




# పుట్టిన రోజు బహుమతి



రచన: క్రాంతి చదువుల, తొమ్మిదవ తరగతి(A), ప్రభుత్వ ఉన్నత పాఠశాల, టెక్కలి.

టెక్కలి బళ్ళో చదివే సుందర్, మాధవ్‌లు మంచి స్నేహితులు. ఇద్దరికీ జీవశాస్త్రం అంటే చాలా ఇష్టం. జీవశాస్త్రం బోధించే రమేష్ సార్ అంటే మరీ ఇష్టం.

రమేష్ సార్ పిల్లలకు అచ్చుపుస్తకాల్లోంచి బోధించటం మాత్రమే కాదు- వాళ్లచేత రకరకాల సైన్సు పుస్తకాలు చదివిస్తారు. ఇతరులతో ప్రేమగా మెలగటం ఎట్లాగో నేర్పిస్తారు. ఇక ఆయనంటే పిల్లలకు ఇష్టం ఎందుకుండదు?

ఆరోజు సాయంత్రం బడి మూసేస్తారనగా గుర్తొచ్చింది సుందర్-మాధవ్‌లకు. రమేష్ సార్ ఆరోజున ఏదో మంచి పాఠం చెప్తానన్నారు. ఆటల్లో పడి తాము ఆ సంగతి మరచారు!

సుందర్, మాధవ్ ఇద్దరూ ఆయాసపడుతూ పరుగెత్తుకొని వచ్చేసరికి రమేష్‌సార్ పుస్తకాలు సర్దుకుంటున్నారు.

"సార్! 'ఇవాళ్ళ ఏదో ప్రత్యేకమైన రోజు- మీకు ఓ మంచి పాఠం చెప్తాను' అన్నారు, మీరు. ఆటల్లో పడి మేం మరచేపోయాం సార్! క్షమించాలి" అన్నారిద్దరూ వగరుస్తూ.

"ఒళ్ళంతా మట్టేమిట్రా, వెళ్ళి కడుక్కొని రండి!" అన్నారు రమేష్‌మాస్టారు.

"ఈ సమయానికి రోజూ ట్యాంకులో నీళ్ళు అయిపోతున్నాయి సార్. అందుకని ఇక రోజూ ఇంటికెళ్ళాకే కాళ్ళు చేతులు చక్కగా కడుక్కునేది" అన్నాడు సుందర్.

"అదే, ఇవాళ్ళ నేను చెప్తానన్న పాఠం! అటు చూడండి జాగ్రత్తగా- మీరంతా లంచ్ బాక్సులను కడుక్కున్నాక నీళ్ల కుళాయిలు కట్టెయ్యలేదు, గమనించారా? రోజూ అలా వదిలేస్తూనే ఉన్నారు. అందుకనే సాయంత్రానికి ఇక ట్యాంకులు ఖాళీ అయిపోతున్నాయి. అవ్వవామరి!?" అన్నారు రమేష్‌మాస్టారు.

అంతలోనే మరికొందరు పిల్లలు వచ్చి చేరుకున్నారు మాస్టారి చుట్టూ.

"ఇది ఏ ఒక్కరి బాధ్యతో కాదు సుందర్! ఉమ్మడి బాధ్యత. మన దేశంలో నీటి వాడకం కంటే వృధానే ఎక్కువ- తెలుసా?" మాస్టారి మాటలకు పిల్లలందరికీ సిగ్గనిపించింది.

"నిజమే మాస్టారూ! మా ఊళ్ళోకూడా మొన్న మొన్నటి వరకూ అదే సమస్య. అయితే మేం పిల్లలం నీళ్లని వృధా చేయకుండా జాగ్రత్త పడటం చూసి, ఊళ్ళో పెద్దవాళ్ళు కూడా చాలా మారిపోయారు. ఇప్పుడు అందరూ నీళ్ళని పొదుపుగానే వాడుతున్నారు" చెప్పాడు క్రాంతి.

"నా పుట్టిన రోజున ఒక మంచి మాట విన్నందుకు నాకెంతో సంతోషంగా ఉందిరా" అన్నారు మాస్టారు, ముఖంలో ఆనందం తళుక్కుమనగా.

విద్యార్థులందరూ గట్టిగా ఆశ్చర్యపోయారు- "నిజంగానా?! జన్మదిన శుభాకాంక్షలు మాస్టారూ!" అన్నారు.

"ఈ సందర్భంగా మీరు మాకో పార్టీ ఇవ్వాలి మాస్టారూ" అడిగారు క్రాంతి, మాధవ్ చనువుగా.

రమేష్ మాస్టారు నవ్వుతూ "థాంక్యూ. నేను పార్టీ ఇస్తాను..మరి మీరంతా నాకు ఏం బహుమతి ఇస్తారు?" అడిగారు.

"ఇక మీదట బడిలో ఎన్నడూ ఒక్క చుక్క నీరు కూడా వృథా చేయమని ప్రతిజ్ఞ చేస్తున్నాం మాస్టారూ" అన్నారు, రమేష్ మాస్టారి అంతరంగం తెలిసిన క్రాంతి.

"ఆహా! బాగుంది. ఇక్కడే కాదు పిల్లలూ! రోజూ కాలేజీ పిల్లలు లంచ్ బాక్సులు కడిగే చోట చాలా నీళ్ళు మడుగు అవుతున్నాయి. ఆ నీరంతా మొక్కలకు మళ్ళించేందుకు నేను ఇవాళ్ళ కాలవలు తీస్తాను. అది నేను మీకిచ్చే పార్టీ" అన్నారు మాస్టారు.

"మేం ఒప్పుకోం సార్... అది మా పని!" అరిచాడు మాధవ్.

"సరేలే. మరి మీరు ఆదా చేసిన నీళ్ళతో మన బడిలో కూరగాయలు, పండ్లు పండిస్తాను- అవే నేను మీకిచ్చే చాక్లెట్లు!" అన్నారు మాస్టారు నవ్వుతూ.

పిల్లలందరూ సంతోషంగా చప్పట్లు కొట్టారు. "మేము సైతం ఈ పనిలో చేతులు కలుపుతాం.. దయచేసి కాదనకండి మాస్టారూ" అని అరిచారు.

మాస్టారు ఆనందంగా "సరే, మీలాంటి విద్యార్థులు అందరూ మేము సైతం అంటూ ముందుకు వస్తే పర్యావరణాన్ని కాపాడటం చిటికెలో పని. ఇంతకంటే నాకు పుట్టినరోజు బహుమతి ఏముంటుంది?!" అన్నారు క్రాంతి భుజాన్ని ప్రేమగా తడుతూ.

**ముద్రా రాక్షసం!**

"ఈసారి పరీక్షల్లో పిల్లలెవ్వరూ జవాబులు వ్రాయలేదు. దానికి కారణం పూర్తిగా ప్రభుత్వం వారిదే" విన్నవించుకు-న్నారు ఓ బడి ప్రధానోపాధ్యాయులవారు.

"ఏమైంది? ఎందుకు రాయలేదు?" అడిగారు డి యీ వో గారు.

"ప్రశ్నపత్రంలో అచ్చు తప్పు పడింది: 'ఈ క్రింది జవాబులకు సరైన ప్రశ్నలు ఇవ్వండి' అని పడింది. పిల్లలందరూ ప్రశ్నలు రాసి బయటికి వచ్చేశారు!" బాధగా చెప్పారు ప్రధానోపాధ్యాయులవారు!"




# స్పిరిట్

*పెంపుడు జంతువులంటే ఎవరికైనా ఇష్టమే. అయితే వాటికేమన్నా అయితే మటుకు పిల్లలకు చాలా బాధ వేస్తుంది- ఈ కథలో గుర్రాన్ని పెంచుకున్న రాముకి వేసినట్లు. అప్పుడేం చెయ్యాలి? -ఇదిగో, చదవండి...*
*రచన: టి.రోహిత్, 4 వతరగతి, రిషివ్యాలీస్కూల్.*

ఒక ఊరిలో రాము అనే పిల్లవాడు ఉండేవాడు. వాడు చాలా బుద్ధిమంతుడు. ఎందుకో తెలీదు, కానీ వాడికి 'గుర్రాలు' అంటే చాలా ఇష్టం. ఎప్పుడూ కూర్చొని గుర్రాల బొమ్మలు వేస్తూ ఉండేవాడు.

వాడి స్నేహితులందరూ వాడి బొమ్మల్ని బలే మెచ్చుకునేవాళ్ళు. 'ఇట్లాంటి గుర్రం నాది, అట్లాంటి గుర్రం నీది' అని మాట్లాడుకునేవాళ్ళు. మెల్లగా రాముకి కూడా ఆ ఆలోచన మొదలైంది. 'ఒక గుర్రం కొనుక్కోగలిగితే బాగుండు' అనుకున్నాడు.

దాని కోసం కొంచెం కొంచెంగా డబ్బు

కూడబెట్టసాగాడు రాము. ఒకవైపున చదువుకుంటూనే, ఆ డబ్బుల్ని సంపాదించటం కోసం చాలా కష్టపడి పనిచేశాడు. చాలా రోజుల తరువాత అతనికి కావలసినంత డబ్బు సమకూరింది. దాన్ని పెట్టి ఒక తెల్లరంగు గుర్రం పిల్లని కొన్నాడు వాడు. తను చూసిన ఓ సినిమాలోకూడా ఒక తెల్లగుర్రం ఉంది- దాని పేరు 'స్పిరిట్'. ఆ గుర్రాన్ని తలచుకొని, రాము తన గుర్రప్పిల్లకు 'స్పిరిట్' అని పేరు పెట్టాడు.

రాము తల్లిదండ్రులకు కూడా స్పిరిట్ చాలా నచ్చింది. వాళ్ళు గుర్రాల గురించిన చాలా పుస్తకాలు కొనిపెట్టారు రాముకు. అందరూ స్పిరిట్‌కి బాగా బలమైన తిండి పెట్టారు. ఆ గుర్రం కూడా చాలా బలంగా పెరిగింది. తను కూడబెట్టిన డబ్బుతో రాము ఆ గుర్రానికి ఒక జీను కొన్నాడు. రాము రోజూ ఇంటికి రాగానే అది వాడి దగ్గరకొచ్చి నిలబడేది. వాడు దాని మీద ఎక్కి స్వారీ చేస్తే దానికీ చాలా సంతోషంగా ఉండేది.

రాము బాగా చదువుకున్నాడు. ఇప్పుడు వాడు ఉద్యోగంలో చేరాడు. ఈలోగా ఇంట్లో వాళ్లకు అందరికీ స్పిరిట్ బాగా దగ్గరైపోయింది. జంతువు అయినా వాళ్ళింట్లో మనిషిలాగానే ఉండసాగింది.

మీకు తెలుసుగా, గుర్రాలు మనుషులంత కాలం బ్రతకవు. మహా అయితే 20-25 ఏళ్ళు బ్రతుకుతాయంతే. అట్లా, రాము కొంచెం పెద్దయ్యేసరికి, స్పిరిట్ ముసలిది అవసాగింది. కొన్నాళ్ళకి అది చనిపోయింది!

రాము చాలా బాధపడ్డాడు- ఎప్పుడూ ఆ గుర్రాన్ని గురించే ఆలోచించటం మొదలు పెట్టాడు. ఇప్పుడు వాడికి ఏదన్నా ఇష్టం లేకుండా అయింది. చివరికి తన ఉద్యోగం కూడా చేయబుద్ధి కాలేదు. ఇంట్లోనే కూర్చొని నిశ్శబ్దంగా ఉండసాగాడు.

అది చూసిన రామువాళ్ల అమ్మ "రామూ! ఎప్పుడూ అలా బాధ పడకూడదు. నీకు గుర్తుందా, చిన్నప్పుడు నువ్వు ఎంత చక్కగా బొమ్మలు వేసే వాడివో? ఒకసారి స్పిరిట్ మనింటికి వచ్చాక, ఇక సమయం లేదని నువ్వు బొమ్మలు వేయటం మానేశావు.

ఇప్పుడు నువ్వు మరోసారి బొమ్మలు వేయటం మొదలుపెట్టు. ముందుగా నీ మనసులో నిలచిపోయిన స్పిరిట్ బొమ్మని అందంగా చిత్రించి, నీ గదిలో పెట్టుకో. మరి నువ్వు బొమ్మలు వేసి చాలా కాలం అయ్యింది గదా, అందుకని ముందు కొంతకాలం ఎక్కడయినా పెయింటింగ్ క్లాసులకి వెళ్తావేమో, చూడు" అంది.



రాము లేచి నిలబడ్డాడు. ఆ రోజు నుండే పెయింటింగ్ క్లాసులకి వెళ్ళటం మొదలు పెట్టాడు. కొద్ది రోజుల్లోనే తన చేతిలోని కళ మళ్ళీ పైకి వచ్చింది. చక్కని బొమ్మలు తయారవ్వసాగాయి.

చిత్రకళలో మనసు నిల్పినకొద్దీ వాడి బాధ దూరమైంది. సంతోషం వచ్చింది. తన గుర్రం బొమ్మని పెద్దకాన్వాస్ మీద చిత్రించి అమ్మకి చూపించాడు రాము.

అమ్మ వాడిని చాలా మెచ్చుకున్నది. "మన చుట్టూ ప్రకృతిలో అద్భుతమైన వింతలున్నాయి రామూ; తెలీని అందం ఉంది. ప్రశాంతంగా గమనిస్తూ ఉంటే ఆ అందం మన మనసు లోతుల్ని తట్టి, సంతోషంతో నింపుతుంది. చిత్రకారుడు తనకు తట్టిన ఆ అందాన్ని కుంచె ద్వారా మళ్ళీ వ్యక్తీకరిస్తాడు. అట్లా తన సంతోషం రెండు రెట్లవుతుంది. నువ్వు ఇంకా గొప్ప చిత్రకారుడివవ్వాలి" అన్నది.

తన చుట్టూ ఉన్న పరిసరాలను, జంతువులను, మనుష్యులను, భవనాలను ఎంతో అందంగా చిత్రించసాగాడు రాము. గొప్ప పెయింటర్ అని పేరుతెచ్చుకోవటమే కాదు; గొప్ప సంతోషాన్ని సంపాదించుకోగలిగాడు!





# స్వగతం!

*చాలా చక్కని రచన! కిరణ్‌కు అభినందనలు. ఈ చిట్టి కథ అందరికీ నచ్చుతుంది- చదవండి...*

*రచన: గాలి కిరణ్, పదవ తరగతి, తేజ విద్యాలయ, కోదాడ, నల్గొండ జిల్లా.*

పచ్చటి చెట్ల మధ్య ఉన్నాను నేను. గాలి బాగా వీస్తోంది. ఈ రోజున అయితే ఎండ కూడా బాగానే ఉంది.

నా ప్రక్కన ఉన్న మిత్రులంతా గాలిని ఆస్వాదిస్తూ, సంతోషం పట్టలేక అటూ ఇటూ ఊగుతున్నారు.

నన్ను మటుకు ఒక బడుద్ధాయి పిట్ట పిల్ల ఏడిపిస్తున్నది- నాపైన వాలింది. చింపిరి చింపిరిగా నా జుట్టును లాగుతున్నది. నేను ఎంతతిట్టినా, ఎంత పొమ్మన్నా సరే; దానికి అసలు భయం అనేదే ఉన్నట్టు లేదు.

నన్ను చూసి అందరూ 'చాలా చండాలంగా, భయంకరంగా ఉంటావు' అంటారు- కానీ ఈ పిట్ట ఐతే నన్ను చూసి అసలు భయపడటమే

లేదు!

అంతలో, నా అదృష్టం! చీకటి పడింది. పిట్ట పిల్ల వెళ్ళిపోయింది. ఎప్పటి లాగే నేను స్థిరంగా, కదలకుండా ఉండగలిగాను.



రెండో రోజునా తిరిగి వచ్చింది- పాడు పిట్ట పిల్ల. అయితే అది ఈ రోజు ఎందుకో బాధగా ఉంది. ఎంత అడిగినా కారణం చెప్పలేదు. చివరికి నేను గట్టిగా, గదమాయించి అడిగే సరికి, అప్పుడు చెప్పింది- "నేను నివసించే చెట్టును ఎవరో నరికేశారు" అని! నాకు కూడాచాలా బాధ అనిపించింది, అది విని. కొంచెంసేపు నా నోట్లోంచి మాటలే రాలేదు.

తర్వాత చెప్పాను- 'ఇంకో చెట్టు మీద ఇల్లు కట్టుకో, మరి!' అని.

కానీ అప్పుడు అది అన్న మాట నన్ను ఇంకా బాధించింది : "నేను ఇంకో చెట్టు మీద ఇల్లు కట్టుకున్నా, దాన్ని కూడా నరికేస్తారు కదా! మనుషులు నరకని చెట్టంటూ ఏదైనా ఉందా, చెప్పు!?" అని.

దానికి చెప్పేందుకు నాకు నోట మాట రాలేదు. నిజంగానే మనుషులు నరకని చెట్టంటూ ఏదీ లేదు కదా?

చివరికి ఆ పిట్టని నాపైనే ఇల్లు కట్టుకోమన్నా.

అప్పుడది నవ్వింది- "నిజానికి నీపైన వేరేగా గూడు కట్టుకోవాల్సిన అవసరం ఏమున్నది? నువ్వే ఓ చక్కని గూడు లాగా ఉన్నావు కదా?" అన్నది.

అప్పుడు నాకు గుర్తు వచ్చింది- "నేనొక పొలంలో దిష్టిబొమ్మను- నన్నూ తీసేస్తారు త్వరలో" అని.



# ఊహ

*కొత్తపల్లి-59 లో ఇచ్చిన బొమ్మకు ఆలస్యంగా వచ్చిన చాలా స్పందనల్లో మరోటి...*
*రచన: కె.దేవీ చందన, తొమ్మిదో తరగతి, జాస్మిన్, అరవింద స్కూల్, కుంచనపల్లి.*

అనగనగా ఒక ఊళ్ళో రాజేష్ అనే పిల్లవాడు ఉండేవాడు. వాడు చాలా మంచివాడు. ఒకసారి వాళ్ల మిత్రులందరూ కలిసి ఒక విహారయాత్రకు వెళ్దామనుకున్నారు. ఇంట్లో వాళ్ళు కూడా అందుకు ఒప్పుకున్నారు.

తెల్లవారు జాముననే ప్రయాణం... అందరూ కలిసి బయలుదేరారు. కాకపోతే వాళ్ళు వెళ్ళింది విహారయాత్రకు కాదు- ఒక అడవిలోకి! అడవిలో ఒక రహస్య ప్రదేశంలో రాజుల కాలంనాటి నిధి ఒకటి ఉన్నదని తెల్సింది వాళ్లకి. అందుకని వాళ్ళంతా ఆ అడవికి ప్రయాణం అయ్యారు.

అడవిలో అందరూ తలా ఒక దిక్కుకూ వెళ్ళారు. ఎవరికి వాళ్ళు మ్యాపులు పట్టుకొని

వెతకటం మొదలు పెట్టారు. మెల్లగా చీకటిపడసాగింది. అందరూ అడవిలోంచి బయటికి వచ్చేశారు.

అట్లా అడవిలోంచి బయటికి వచ్చిన పిల్లలకు లోపలినుంచి సింహాల గర్జనలు వినిపించాయి. తమను తాము లెక్కించుకొని చూసుకుంటే రాజేష్ లేడనే విషయం తెలిసింది. రాజేష్‌ను సింహాలు తినేసి ఉంటాయని అనుకొని, అందరూ బాధతో ఏడుస్తూ తిరిగి ప్రయాణం అయ్యారు.

అయితే అక్కడ అడవిలో రాజేష్‌కు నిజానికి ఏమీ కాలేదు. వాడు ఆ అడవిలోంచి వెనక్కి తిరిగి వస్తుంటే అక్కడొక పొదలో కూర్చొని వాడివైపే చూస్తున్న కుందేలు పిల్ల ఒకటి కనిపించింది వాడికి. దాన్ని రాజేష్ మచ్చిక చేసుకొని దగ్గరికి తీసుకున్నాడు. ఆ కుందేలుకు కూడా రాజేష్ ఎంతగానో నచ్చాడు. వాళ్ళిద్దరూ కలిసి ఆడుతూ పాడుతూ హాయిగా ఆడుకుంటూ ఉండిపోయారు. సాయంత్రం అయినా రాజేష్‌కు 'ఆ కుందేలును విడిచిపెట్టి ఎక్కడికీ వెళ్ళాలి' అనిపించలేదు!



ఆరోజు రాత్రి కుందేలు పిల్ల వాడికి క్యారట్లు, అడవిలో దొరికే దుంపలు తెచ్చి ఇచ్చింది. వాడు వాటిని తిని, తను ఏరుకొచ్చిన గడ్డి పరకలను కుందేలుకు తినిపించాడు. ఆ తర్వాత ఇద్దరూ అక్కడే నిద్రపోయారు!

తెల్లవారు జామున లేచి చూస్తే రాజేష్‌కు కుందేలు పిల్ల కనిపించలేదు! అంతలోనే దబ్బుమని శబ్దం చేసుకుంటూ వాడు మంచం మీదినుండి క్రింద పడిపోయాడు. అంటే ఇదంతా వాడి కల అన్నమాట!

# పని ఎలాజరుగుతుంది?

రచన: మల్లేష్, ఏడవ తరగతి, విశ్వభారతి విద్యాలయం, జహీరాబాదు
సౌజన్యం: జహీరాబాద్ పిల్లల కథలు



నర్సయ్య అన్ని పనులకూ ఇతరుల మీదే ఆధారపడేవాడు. తన పని కూడా తను చేసుకునేవాడు కాదు. నాగలి పట్టి దున్నే దగ్గరినుండి కోత కోసి కుప్ప నూర్చేవరకూ ఏదీ సొంతగా చేసేవాడు కాదు.

ఒక సంవత్సరం వానలు బాగా పడ్డాయి. పొలం ఏపుగా పండింది. "పంటను సకాలంలో కోయకపోతే వెన్ను నేల రాలిపోతుంది" అని చుట్టు ప్రక్కల రైతులందరూ నర్సయ్యకు చెప్పారు.





"మరి మీరే వచ్చి కొంచెం కోసి పెట్టచ్చు కదా?" అన్నాడు నర్సయ్య. "అది వీలయేట్లు లేదురా అబ్బీ, మా పంటలు కూడా ఇప్పుడే కోతకు వచ్చాయి కదా! ముందు మా పని చేసుకుని, ఆ తర్వాత వీలునుబట్టి నీ పనీ చేసి పెడతాం" అన్నారు రైతులు.

నర్సయ్య తన బంధువులకు కబురు చేశాడు. ఎవర్నడిగినా అదే సమాధానం- "వీలయ్యేట్లు లేదు" అని.



రోజులు గడుస్తున్నాయి. పంట బాగా ఎండింది. నర్సయ్య కంగారు పడుతున్నాడు; చేతికొచ్చిన పంట నేలపాలు అవుతుందని దిగులు పడుతున్నాడు. తెలిసినవాళ్ళను అందరినీ మళ్ళీ మళ్ళీ అడుక్కున్నాడు. లాభం లేకపోయింది.

ఆ తర్వాతి రోజున గింజ రాలటం కూడా మొదలైంది. నర్సయ్యకు ప్రాణాలు పోయినట్లయింది. అయినా గత్యంతరం లేదు. ఇక ఆలస్యం చేసేందుకు లేదు. సొంతగానే పంటను కోయటం మొదలుపెట్టేశాడు.



అలవాటు లేని పని అవ్వటంతో మొదట్లో చాలా కష్టం అనిపించింది. కానీ కొంతసేపటికల్లా పని సులువు అయ్యింది. రెండు రోజులు నిద్రాహారాలు లేకుండా పని చేశాడు నర్సయ్య. అయితేనేమి, కోతలు విజయవంతంగా పూర్తయ్యాయి.

మరో రెండు రోజులకు పంట ఇంటి కొచ్చింది. ఆరోజు సంతృప్తిగా నిద్రపోతూ అనుకున్నాడు నర్సయ్య- "కష్టం అయితే అవ్వనీ: మన పని మనం చేసుకుంటేనే, పని జరిగేది!" అని.

నవ్వు!

**ఎన్ని పాకెట్లు?**

రామారావు: మీవాడికి ఎప్పుడూ అంతంత పాకెట్ మనీ ఇస్తుంటావు కదా, వాడు ఏం చేస్తుంటాడు, దాంతో?

సుబ్బారావు: ఏముంది, మరిన్ని పాకెట్లు ఉండే డ్రస్సులు కొనుక్కుంటాడు!

# బొమ్మకు కవిత రాయండి!

సృజన: శ్రీమతి జి.లలిత, తెలుగు4 కిడ్స్ డాట్ కాం.

ఈ బొమ్మను చూడండి; ఈ కవితను చదవండి:

అన్న చేతిలో ఒక బంతి ఉంది,
జారి పాప దగ్గర పడింది.

పాపాయి బంతిని నెట్టింది,
నాన్న వద్ద అది ఆగింది.

పాపాయి పాకుతూ వెళ్ళింది,
పాప చెయ్యి తగిలి బంతి దొర్లింది.

బంతి అమ్మను చేరింది
పాపాయి కిలకిలా నవ్వింది!

పాపాయి - బంతి





మరి ఇప్పుడింక మీరూ ఈ బొమ్మకు ఓ కవిత రాసి పంపించండి- కొత్తపల్లి-64 లో ప్రచురిద్దాం!

మా చిరునామా: కొత్తపల్లి, యంఆర్వోఆఫీసు దగ్గర, చెన్నేకొత్తపల్లి, అనంతపురం జిల్లా-515101 ఫోను: 7702877670, ఇ-మెయిలు: team@kottapalli.in




# మంచి దొంగ

*'పిసినారి ముసలివాడు' కథ తెలుసా? దానికి అద్భుతమైన అంతాన్ని మరోటి తెచ్చి, చిట్టి కథలు ఎంత చక్కనివో మరోసారి గుర్తు చేస్తున్నది ఈ కథ..చూడండి!*
*రచన: వి.వి.ఎస్. మూర్తి, చొదిమెళ్ళ, పశ్చిమగోదావరి జిల్లా.*

రామయ్య అనే రైతు వయసులో వున్నప్పుడు కష్టపడి బాగా సంపాదించాడు.

వృద్ధాప్యంలో, ఆ సంపాదనని అంతా బంగారు కాసులుగా మార్చి, ఓ మట్టి కుండలో పెట్టి, పెరట్లో గొయ్యి తవ్వి, ఆ గోతిలో పాతి పెట్టాడు. రోజూ ఉదయం-సాయంత్రం పెరట్లోకి వెళ్ళి, పై మట్టి తీసి, కాసుల కుండను తనివితీరా చూసుకుని, మళ్ళీ మట్టి కప్పి పెట్టేసేవాడు.

ఈ రహస్యాన్ని పసిగట్టాడు, ఒక దొంగ.

ఆ రోజు రాత్రే ఆ దొంగ వచ్చేసాడు. ముసలాయనకు తెలీకుండా గొయ్యి తవ్వి చూశాడు. మట్టి కుండ లోని బంగారు

కాసులన్నీ తీసుకున్నాడు. దాని నిండా పెంకు ముక్కలు వేసాడు. ఒక్క క్షణం ఆలోచించి, ఆ పెంకుల పైన మాత్రం పది బంగారు కాసులు కప్పాడు!!

మర్నాడు ఉదయం యథాప్రకారం గొయ్యిపైన మట్టి త్రవ్వి కుండను బయటికి తీసాడు ముసలాయన. కుండ పై భాగంలో వున్న బంగారు కాసుల్ని తనివితీరా చూసుకున్నాడు. తృప్తిగా మట్టి కప్పేశాడు.

ఇలా రోజూ కుండ పైనున్న కాసులను చూసుకుంటూ సంతోషంగా బ్రతికిన ముసలాయన, ఒక రోజున తృప్తిగా తన జీవితం చాలించాడు.

మంచి దొంగలకి మనసు ఉంటుందనమాట!

పొంచి, బుజ్జగించి, పొగడి, టక్కరిమూక
మంచివారి మోసగించుచుండు
కాకి జున్ను ముక్క కాజేసెరా నక్క
లలిత సుగుణజాల! తెలుగుబాల!

టక్కరి దొంగలు పొంచి ఉంటారు; బుజ్జగిస్తారు; పొగడుతారు; చివరికి మిమ్మల్ని మోసగించేస్తారు. కాకి నోట్లో ఉన్న జున్ను ముక్కని నక్క ఎలా కాజేసిందో తెలుసుగా? అందుకని జాగ్రత్తగా ఉండాలి!

తెలుగు బాల!

సాటివానితోడ జగడమాడగరాదు
తీరుపులకు పరుల జేరరాదు
కొంటెకోతి గడ్డకొట్టె పిల్లులనోట
లలిత సుగుణజాల! తెలుగుబాల!

పిల్లులు రెండూ పోట్లాడుకుంటుంటే కొంటె కోతి వచ్చి ఏం చేసిందో తెలుసుగా? అందుకని తెలుసుకోండి, మీ తోటి వాళ్ళతో పోట్లాడకండి; పోట్లాడి తీర్పుకోసం పరాయి వాళ్ల దగ్గరికి పోకండి. వాళ్ళు మీ ఇద్దరినీ కలిపి మోసగిస్తారేమో, జాగ్రత్త!



# సహాయం

రచన: శ్రీమతి రాధ మండువ, ఉపాధ్యాయిని, రిషీవ్యాలీ స్కూల్, రిషీ వ్యాలీ, చిత్తూరు జిల్లా.

గోపాలపురంలో గోవిందుడు అనే పేద రైతు ఉండేవాడు. అతనికి 'నా' అన్న వాళ్లెవ్వరూ లేరు. గోవిందుడు ఆ ఊరిలో అందరికీ తలలో నాలుకలా ఉండేవాడు; ఎవరు ఏపని చెప్పినా కాదనకుండా చేసేవాడు. కోమటి కొట్టుకెళ్ళి సామాను తెచ్చిపెట్టడం దగ్గర నుండి- కొబ్బరి చెట్లు ఎక్కి మట్టలు, బోండాలు దించడం వరకూ అన్ని పనులూ చేసిపెట్టేవాడు గోవిందుడు. అయితే అట్లా పని చేసి పెట్టినందుకు ఎవరినీ డబ్బు అడిగేవాడు కాదు. పలహారమో, భోజనమో పెడితే మాత్రం తినేవాడు. అసలు వాడికి డబ్బులు ఇవ్వాలన్న ఆలోచన కూడా ఆ ఊరి వాళ్ళకు ఉండేది కాదు.

ఇలా ఉండగా గోవిందుడి పొలంలో వరి కోతకు కూలికి వచ్చిన రంగన్నకు అతని మంచితనం

నచ్చింది. అతన్ని కొంచెం గమనించిన మీదట, తన కూతురు లక్ష్మిని వాడికిచ్చి పెళ్ళి చేసేశాడు రంగన్న. గోవిందుడి భార్య లక్ష్మి కూడా చాలా మంచిది. కుటుంబంకోసం, భర్త పేరు నిలబెట్టటంకోసం ఆమె కూడా ఒళ్ళు వంచి పని చేసేది.

అయితే భర్త ఇంతమందికి సాయం చేస్తూ కూడా ఎవ్వరి దగ్గరా డబ్బులు తీసుకోడే, ఆ సంగతి మటుకు ఆమెకు నచ్చలేదు. "పని చేస్తున్నందుకు డబ్బులు అడిగి తీసుకోరాదా?" అని ఆమె ఒకటి రెండు సార్లు భర్తను మందలించి చూసింది; కానీ గోవిందుడు- "సహాయం చేసి డబ్బు అడగటం నాకు చేత కాదు. అవసరమైనప్పుడు తప్పకుండా అడుగుతా-నులే. వీళ్ళు కాకపోతే నాకు ఇంకెవరున్నారు?" అని అనడంతో లక్ష్మి మళ్ళీ ఆ ప్రస్తావన తీసుకు రాలేదు. అదనపు సంపాదన కోసం తనే కూలికి వెళ్ళటం మొదలు పెట్టింది.

కొన్నాళ్ళకి వాళ్ళకి పాప పుట్టింది. లక్ష్మి పాపను చూసుకుంటూ ఇంట్లోనే ఉండవలసి వచ్చింది. ఇంటి ఖర్చులు కూడా పెరిగాయి. ఇబ్బందులు పడుతూ సర్దుకుని బ్రతకసాగారు; కానీ గోవిందుడు మాత్రం నోరెత్తి ఎవరినీ సహాయం అడగలేదు. లక్ష్మి తన ముసలి తండ్రిని రమ్మని, పాపకు తోడుగా ఆయన్ని ఇంట్లో ఉంచి, తను పనికి వెళ్ళసాగింది.

రోజులు గడుస్తున్నాయి. గోవిందుడి కూతురు సంధ్య ఊళ్ళో ఉన్న బడికి వెళ్లటం మొదలు పెట్టింది. గోవిందుడి లాగే సంధ్య కూడా పిల్లలందరికీ సహాయం చేసేది. చక్కగా చదువుకునేది.

ఆ సంవత్సరం పదో తరగతి పాసయ్యింది సంధ్య. ఊళ్ళో పదవ తరగతి పాసయిన పిల్లలందరూ పట్టణంలో ఉన్న కాలేజీలో చేరుతున్నారు. తన కూతురినికూడా బాగా చదివించాలనిపించింది గోవిందుడికి. కానీ సంధ్యని కాలేజీకి పంపాలంటే చాలా డబ్బులు కావాలి. గోవిందుడి దగ్గర అంత డబ్బు లేదు. ఇంతవరకూ ఎవ్వరినీ ఏమీ అడగని

గోవిందుడు, పిల్లని కాలేజీకి పంపాలనేసరికి ఊళ్ళో అందరినీ సహాయం అడిగాడు: కానీ ఎవరికి వారు ఏదో ఒక సాకు చెప్పి తప్పించుకున్నారు. కొంతమందికి సహాయం చేయాలని ఉండింది; కానీ సమయానికి చేతిలో డబ్బు లేక 'తరవాత చూద్దాంలే గోవిందా' అన్నారు.

'తనకు అంతగా అవసరమైతే అందరూ ముందుకొచ్చి సహాయం చేస్తారులే' అనుకున్న గోవిందుడు ఊహించని ఈ పరిణామానికి హతాశుడయ్యాడు. అందరినీ అడిగి, ఎవ్వరి దగ్గరా లేదనిపించుకొని, బాధతో ఇంటికి చేరి మంచంలో కూలబడ్డాడు. పరిస్థితి అర్థం అయింది లక్ష్మికి- ఇన్నాళ్ళూ ఓర్చుకున్న దు:ఖం ఒక్కసారిగా కట్టలు తెంచుకున్నది. ఏడుస్తూ భర్తని దూషించసాగింది.

సరిగ్గా అదే సమయానికి వాళ్ళింటి బయట నిలబడి ఉన్నాడు, ఊరి పెద్ద ధర్మయ్య కొడుకు- వేణు. చింతకాయలు కొట్టేందుకు గోవిందుడిని పిలుద్దామని వచ్చాడతను. అయితే వాళ్ళ మాటలు విన్నాక, అతను వెనక్కి తిరిగి వెళ్ళి తన స్నేహితులందరినీ పిలిచి గోవిందుడి సంగతి, సంధ్య చదువు సంగతీ చెప్పాడు. వాళ్ళందరూ సంధ్య తరగతి పిల్లలు. సంధ్య కాలేజీలో చేరలేకపోవడం అందరికీ బాధ కలిగించింది.



"ఇన్నాళ్ళూ మనందరికీ సంధ్య నాన్న ఎన్నో పనులు చేసిపెట్టాడు. ఇప్పుడు వాళ్ళకి అవసరమైతే ఒక్కరికి కూడా సహాయం చేయడానికి చేతులు రావడం లేదు. మనం మన పెద్దవాళ్ళకి చెబ్దాం " అన్నాడు వేణు. మిగతా పిల్లలందరూ కూడా వేణుతో

ఏకీభవించారు.

పిల్లలు మాట్లాడుకునేదంతా విన్న ధర్మయ్య ఊరి వారందరినీ పిలవనంపించి, అందరితోటీ మాట్లాడాడు. ఈలోపు పిల్లలు కూడా పెద్దవారి దగ్గరకి చేరారు. పిల్లా పెద్దా అందరూ కలిసి కావలసిన డబ్బు వసూలు చేసారు. సంధ్యని కాలేజీలో చేర్పించి పుస్తకాలు కూడా కొనిచ్చారు. గోవిందుడు పేరు పేరునా అందరికీ కృతజ్ఞతలు చెప్పుకున్నాడు.

ఇతరులకు సహాయం చేసేవాళ్ళకి భగవంతుడు ఎప్పుడూ తోడుంటాడన్నది మరోసారి ఋజువయింది. 

నవ్వండి!

**వాస్తు పూజ!**

రామారావు: మా ఆవిడకి వంట సరిగ్గా రాకపోవటం పెద్ద సమస్యగా ఉందిరా!

సుబ్బారావు: ఏమయిందిరా, టీవీలో వంటల కార్యక్రమాలు ఎక్కువ చూస్తున్నదా?

రామారావు: అట్లా అయితే పర్లేదు; వంటింటి వాస్తు సరిగ్గా లేదని గొడవ చేస్తున్నది!

**పోలిక!**

సీత: నిన్ను కోతి కరిచిందట గదే, ఏమన్నావు దాన్ని?

సుమతి: దాన్నేం అనలేదే; మా వాడిని తిట్టాను-"కోతిలా చెయ్యకు" అని. అంతే- కోతి పరుగెత్తుకొని వచ్చి నన్ను కరిచి పోయింది!

**హైపరాక్టివ్!**

నాన్న: చింటూ! నీ మార్కులు సరయినవే అంటావా?

చింటూ: నీకెందుకు నాన్నా, అనుమానం?

నాన్న: ఏం లేదు; మా చిన్నప్పుడు ఎవ్వరికీ నూటికి నూటొక్క మార్కులు వచ్చేవి కాదు...

చింటూ: నేనూ అదే అంటే "నువ్వు 'హైపరాక్టివ్' లేరా, నీకంతే" అన్నది, మా టీచర్!



# సంతోషం

*రచన: శ్రీమతి జి.లలిత, తెలుగు4 కిడ్స్ డాట్ కాం.*

ఒక ఊళ్లో రామయ్య అనే పేద రైతు ఉండేవాడు. అదే ఊళ్లో శేషయ్య అనే వడ్డీ వ్యాపారి కూడా ఒకడు ఉండేవాడు.

రామయ్య రోజూ భగవంతుడికి శ్రద్ధగా పూజ చేసి, "సర్వే జనాః సుఖినో భవంతు!- జనులందరూ సుఖంగా ఉందురు గాక!" అంటూ పూజ ముగించేవాడు.

శేషయ్య కూడా దేవుడికి రోజూ పూజ చేసేవాడు. "నా వడ్డీ వ్యాపారం బాగా సాగాలి!" అని కోరుకునేవాడు.

రామయ్య స్థాయిలో పెద్ద మార్పులు లేవు; కానీ రోజులు సుఖంగానే గడిచేవి.

ఇక ఊళ్ళో వాళ్లకు ఎవరికి ఏ అవసరం వచ్చినా శేషయ్య దగ్గర అప్పు ఖచ్చితంగా దొరికేది. అట్లా అతని వ్యాపారం మూడు పువ్వులు-ఆరు కాయలు అయి, బాగా విస్తరించింది.

ఒక రోజున రామయ్య తన పిల్లలిద్దరినీ జాతరకు తీసుకు వెళ్ళాడు. పెద్దమ్మాయి తనకు ఒక బొమ్మ కావాలని అడిగి, కొనిపెట్టించుకున్నది. చిన్నమ్మాయి మటుకు మళ్ళీ మళ్ళీ రంగుల రాట్నం ఎక్కుతానని పేచీ పెట్టింది. "మరి నువ్వు అన్ని సార్లు రంగుల రాట్నం ఎక్కితే, ఇక నీకు బొమ్మ కొనుక్కోవడానికి డబ్బులు మిగలవు!" అన్నాడు రామయ్య.



"పరవాలేదు, నాకు అదే సంతోషం!" అంది చిన్నమ్మాయి.

అయితే సాయంత్రం ఇంటికి వచ్చాక, చిన్నమ్మాయికి అక్కని చూస్తే అసూయ వేసింది. 'తనకేమో బొమ్మ లేదు; మరి అక్కేమో బొమ్మతో ఆడుకుంటున్నది'! అయితే అదేమంత పెద్ద సమస్య కాలేదు- పెద్దమ్మాయి తన బొమ్మని చెల్లెతో బాగానే పంచుకున్నది. ఇద్దరూ కలిసి చక్కగా ఆడుకున్నారు!

ఆ రోజు రాత్రి రామయ్యకు కలలో దేవుడు కనిపించి- "శేషయ్య 'నా వ్యాపారం బాగా సాగాలి' అని కోరుకుంటాడు. నేను అతని కోరిక తీరుస్తున్నాను. అందువల్ల ఊళ్ళో వాళ్ళకి కూడా లాభం కలుగుతోంది. కానీ నువ్వు మటుకు నీ ఒక్కడి కోసం కాక అందరి కోసం అడుగుతున్నావు. నీ కోరికని నెరవేర్చేందుకు నేను ఆగకుండా శ్రమించాల్సి వస్తున్నది; అయినా ఎంత శ్రమపడ్డా, మరి, నీ పనిలో ఏమంత ఎదుగుదల కనబడటం లేదు! చూస్తుంటే నీ పద్ధతి కంటే శేషయ్య పద్ధతే మెరుగు అనిపిస్తున్నది" అన్నాడు.

మర్నాడు ఉదయం రామయ్య ఎప్పటిలానే దేవుడికి శ్రద్ధగా పూజ చేశాడు. పూజ చివర్లో ప్రసాదం తీసుకోవడానికి పిల్లలు

పరుగెత్తుకుంటూ వచ్చారు.

"నాన్నా, నువ్వు దేవుడిని ఏం కావాలని అడుగుతావు?" అని అడిగింది చిన్నమ్మాయి.

"బోలెడు డబ్బులు కావాలంటే ఇస్తాడా?" అని అడిగింది పెద్దమ్మాయి.

"మనం ఏది అడిగినా దేవుడు అది ఇస్తాడు. కానీ మన సంతోషం మాత్రం మన చేతిలోనే ఉంటుంది" అని చెప్పాడు రామయ్య, పొలం దున్నేందుకు బయలుదేరుతూ.

నవ్వండి!

**తెలివి సమస్య!**

పేషంటు: అన్నం తిన్నాక కొద్దిసేపటికి కడుపు బాగా నొప్పిగా ఉంటోంది డాక్టర్!

డాక్టరు: ఏం లేదమ్మా, గ్యాస్ ప్రాబ్లం అంతే!

పేషంటు: మాకు గ్యాస్ బానే ఉంటుందండీ, రెండు సిలిండర్లు ఉన్నాయి- సమస్య ఏమీ లేదు మరి!

**వాస్తవ వాది!**

రామారావు: కాశీకి వెళ్ళొచ్చావటగా? కాశీలో ఏం వదిలేశావురా?

సుబ్బారావు: చక్కెర!

రామారావు: అదేంటి, ఏదో పండు వదిలిపెడతారుగా అందరూ?

సుబ్బారావు: ఏం లేదు, నాకు చక్కెర వ్యాధి ఉంది కదా, ఎట్లాగూ తినగూడదని, చక్కెర వదిలేసి వచ్చా, ఎంచక్కా!

**ఆఫీసు పక్షి!**

సుబ్బారావు ఎప్పుడూ గవర్నమెంటు ఆఫీసుల చుట్టూ తిరుగుతుంటాడు. ఓసారి అతనికి దేవుడు ప్రత్యక్షం అయ్యాడు.

దేవుడు: సుబ్బారావూ! నిన్ను నేను స్వర్గానికి తీసుకెళ్తాను ఇవాళ్ళ.

సుబ్బారావు: సరే స్వామీ! ముందుగా ఎంత ఖర్చవుతుందో చెప్పండి.




# ముళ్ళకంచె

*రచన: శ్రీ. యస్. శివశంకర రావు, ఇంద్రజాలికుడు/ఉపాధ్యాయుడు, రాష్ట్రసచివులు- జనవిజ్ఞాన వేదిక*

భద్రాపురం బడిలో చదువుకునే రాము చాలా తెలివైన పిల్లాడు. వాడు బాగా చదివేవాడు, చక్కగా రాసేవాడు, అందరి మెప్పు పొందేవాడు.

కొత్తగా బడిలోకి వచ్చిన మ్యాజిక్ పుస్తకం వాడికి చాలా నచ్చింది. ఒకసారి వాడు చక్కని మ్యాజిక్ ఒకటి నేర్చుకొని, దానికి కావలసిన సామాన్ల గురించి ఆలోచించుకుంటూ ఒళ్ళుమరచి నడుస్తూ పోతుంటే అకస్మాత్తుగా నల్లటి కారు ఒకటి వాడి ప్రక్కన వచ్చి ఆగింది. బలంగా, మొరటుగా ఉన్న చేతులు నాలుగు కార్లోంచి బయటికి వచ్చినై. రెండు చేతులు వాడి నోరు మూసి తలను పట్టుకుంటే, మరో రెండు వాడి కాళ్లను ఎత్తి కార్లో పడేసినై. కన్నుమూసి తెరచేలోగా వాడు కార్లో ఉన్నాడు; కారు అరవై కిలోమీటర్ల వేగంతో

ప్రయాణిస్తున్నది!

ఇక రాము అరిచేందుకు, గీపెట్టేందుకు, పెనుగులాడేందుకు దేనికీ వీలుకాని పరిస్థితి- కార్లో డ్రైవరు కాక ఉన్నది మరో ఇద్దరు బలశాలులు. తనలాంటి పిల్లల్ని వాళ్ళు ఒక్కసారి మోదారంటే తల పగిలిపోవాల్సిందే. వాళ్ళు రాము నోట్లోబట్ట కుక్కి, కాళ్ళు చేతులు వెనక్కి వంచి కట్టేస్తుంటే ఏమీ చేయలేక నిస్సహాయంగా తలవంచాడు రాము.

ఆ సమయంలో వాడికి తెలిసింది- అక్కడ ఆ పరిస్థితిలో ఉన్న పిల్లవాడు తనొక్కడే కాదు- తనలాంటి పిల్లలు మరో నలుగురు ఉన్నారా కార్లోనే. ఆలోగా కిడ్నాపర్లు వాడినీ మిగతా పిల్లలతోబాటు కారు డిక్కీలో పడేసారు.

ముందు మెత్తటి రోడ్డు మీద పోయిన కారు ఏదో గతుకుల రోడ్డును అందుకున్నది. గతుకులు, గుంతలు ఎత్తి ఎత్తి పడేస్తుంటే పిల్లలకు ప్రాణాలు కడబట్టినట్లవుతున్నది. అయినా అరిచేందుకు కూడా వీలు లేకుండా నోళ్ళలో గుడ్డలు కుక్కి ఉన్నవాయె! చాలా సేపటి తర్వాత కారు ఆగింది. ఇక తలుపులు తీస్తారని ఆశిస్తూ పిల్లలంతా చాలా సేపే ఎదురుచూశారు. చూసీ, చూసీ చివరికి ఎవరికి వాళ్ళు నిద్రపోయారు!



నిద్రలేచేసరికి వాళ్ళందరూ ఏదో రేకుల షెడ్డులో ఉన్నారు. షెడ్డునిండా సిమెంటూ, సున్నమూ, దుమ్మూనూ! షెడ్డుకు ఒక కిటికీ కూడా లేదు. తలుపుకి బయటినుండి గొళ్ళెం పెట్టి ఉన్నది. పిల్లలు ఆకలికీ దాహానికీ- దేనికి ఎంత అరచి గీపెట్టినా వినే నాధుడెవడూ అక్కడ ఉన్నట్లు లేదు. నీరసించి పోయిన పిల్లలు అట్లా మరో రోజు గడపాల్సి వచ్చింది.

మూడవ రోజున షెడ్డు తలుపులు తీసి,

పిల్లలందరికీ తలా ఒక గ్లాసెడు నీళ్ళిచ్చాడు ఒక మొరటు మనిషి. వాళ్ళందరినీ బయటికి రమ్మని, ముఖాలు కడుక్కునేందుకు చోటు చూపించాడు. అందరికీ తలా ఒక గ్లాసెడు గంజి పోశాడు త్రాగేందుకు.

పిల్లలందరూ పాపం, ఆకలితో ఉన్నారు కదా, చప్పరించుకుంటూ త్రాగారు గంజిని.

అందరికీ తలా ఒక కత్తినీ ఇచ్చి, అక్కడున్న ముళ్ళ కంచెలు నరకమని సౌంజ్ఞ చేశాడు మొరటాయన. కాదనేందుకు లేదు; రాదనేందుకు లేదు. పిల్లలందరూ ఆపసోపాలు పడుతూ పని మొదలు పెట్టారు. ఇట్లా రోజులు గడవసాగాయి. ప్రతిరోజూ వీళ్లకు తిండి పెట్టటం, అటుపైన మట్టి త్రవ్వటం, కంపలు నరకటం, గడ్డీ గాదం తెచ్చి వాములు వెయ్యటం- ఇలా ఏ పనంటే ఆ పని వాళ్ళచేత చేయించుకునేవాడు. ఏ సమయంలోనూ మొరటాయన ఏమీ మాట్లాడేవాడు కాదు. అంతేకాదు- పిల్లలెవ్వరూ ఒకరితోఒకరు మాట్లాడు-కునేందుకు వీల్లేదు- మాట్లాడితే చాలు- వచ్చి కొట్టేవాడు.

ఆ ప్రదేశంలో మొరటాయన, నాలుగు వేటకుక్కలూ తప్ప మరే ప్రాణీ ఉన్నట్లే లేదసలు. ఆ ప్రదేశం ఏమిటో, ఎక్కడ ఉన్నదో, అక్కడికి తమను ఎందుకు తీసుకొచ్చారో, అసలు వీళ్ళెవ్వరో- ఎవ్వరికీ తెలీలేదు. మొరటాయన మూగవాడేమో- అతని నోట్లోంచి ఒక్క శబ్దమూ రాగా ఎవ్వరికీ వినబడలేదు. ఇక కుక్కలు, వీళ్ళలో ఎవరు కొంచెం అటు దూరంగా అడుగు వేసినా మీదపడి కరిచినంత పనిచేసేవి!

తాము కొట్టిన కంపల్ని చూసేసరికి రాముకి ఒక ఆలోచన వచ్చిందొకరోజున. పనిలో పనిగా కొంత బోద గడ్డిని తెచ్చి పరచి, వాటి మీద కొన్ని ముళ్ళ కంపల్ని వేసి మంట పెట్టాడు. ఆకులు మాత్రం కాలిపోయేట్లు కాల్చాడు వాటిని. ఆ కంపల్ని తడక మీద బిగించి కడితే, ముళ్ళన్నీ నిక్కపొడుచుకొని, 'ముళ్ళ పరుపు' ఒకటి తయారైంది.

ఆరోజు రాత్రి పని అంతా ముగిశాక, ఆ 'పరుపు'ను తాము పడుకొనే షెడ్డు

ముందుకు లాక్కెళ్ళి పెట్టాడు రాము. మొరటాయన ఇదంతా చూసినట్లు లేదు- చూసినా మరి పట్టించుకోలేదేమో.



మర్నాడు తెల్లవారేసరికి రాము నిలువునా బొట్టు పెట్టుకుని, "మౌన ఉపవాస వ్రతం" అని ఒక బోర్డు రాసి పెట్టుకొని, ఆ ముళ్ళ పరుపు మీద పడుకొని కనబడ్డాడు మొరటాయనకు. నల్లగా, కోసుగా ఉన్న ఆ ముళ్ళు దిగితే రాము శరీరం చిల్లుల జల్లెడే అయిపోవాల్సిందే! అయినా మరి, ముళ్ళు ఎందుకనో రాముని ఏమీ చేయట్లేదు. కదలకుండా పడుకొని ఉన్న రాముకి ఆరోజున పనేమీ ఇవ్వలేదు మొరటాయన. తోటి పిల్లలు మటుకు, మధ్యలో రహస్యంగా చాలా సార్లు వచ్చి, నవ్వుతూ బొటనవేలు చూపించి, మొరటాయన తమకు తినేందుకు పెట్టినవేవో రాముతో పంచుకొని పోసాగారు.

మరునాడు రాము తన ముళ్ళ పరుపును ఎత్తిపెట్టేసి అందరితోపాటు పనిలోకి దిగాడు. అయినా ఎందుకనో, ఇప్పుడు మొరటాయన రాముని కొట్టటం ఆపేశాడు. 'కొంచెం భయపడుతున్నాడేమో' అనికూడా అనిపించింది రాముకు. మరో రెండు రోజులకు మళ్ళీ రాము మౌన ఉపవాస వ్రతం; ముళ్ళకంప శయనం చేశాడు. ఈసారి మొరటాయన ఎక్కువ సమయం రాము పడుకొని ఉన్న షెడ్డు ముందే తచ్చాడాడు. ఏం చేయాలో తెలీనట్లు వేళ్ళు విరుచుకున్నాడు, గోళ్ళు కొరుక్కున్నాడు. ఆరోజు రాత్రి వీళ్ళుండే చోటికి ఎవరో మరో నలుగురు మనుషులు వచ్చారు. అందరూ వచ్చి 'ముళ్ళపరుపు'ను దూరం నుండే భయభక్తులతో చూసి ఏవో సాంజ్ఞలు చేసుకొని

వెళ్ళారు.

రాము, పిల్లలు నవ్వుకున్నారు; ఆ తర్వాత రెండు రోజులకు ముచ్చటగా మూడోసారి 'మౌన ఉపవాస వ్రతం' మొదలయింది. ఆరోజు సాయంత్రం కల్లా వచ్చి ముళ్ళకంప మీద పడుకున్న రాముని భయ భక్తి యుతంగా చూసారు ఆ నలుగురూ. ఆ తర్వాత మొరటాయనా, వాళ్ళూ ఏవేవో చర్చించుకున్నారు- వింటున్న పిల్లలకు అర్థమైంది- మొరటాయనకు మాటలు వచ్చు! అతను డబ్బులిచ్చి తమను ఆ నలుగురి దగ్గరా కొనుక్కున్నాడు! ఇప్పుడు ఈ ముళ్ళకంప పరుపు పుణ్యమా అని 'తన డబ్బులు తనకు ఇచ్చేసి, పిల్లల్ని తీసుకెళ్ళిపొమ్మ'ని గొడవ పెడుతున్నాడు!

కొద్ది సేపటికి విసురుగా లోనికి వచ్చారు కిడ్నాపర్లు నలుగురూ. రాము దగ్గరున్న ముళ్ళపరుపును తీసి ఎక్కడో దూరంగా పారేసి, బెదిరిస్తూ తెలీని భాషలో ఏదేదో అన్నారు. వాళ్ళతోబాటు కారెక్కి వెళ్ళాడు మొరటాయన- వాళ్ళు అటు వెళ్ళిన మరుక్షణం ఆ అవకాశం కోసమే ఎదురు చూస్తున్న పిల్లలు ఐదుగురూ బయటికి పరుగు పెట్టారు. ఏమంటే మొరటాయన కుక్కల్ని కట్టేసే ఉంచాడు; కంగారులో వాటిని విడచిపెట్టటం మరచాడు మరి!



అక్కడికి దగ్గర్లో అసలొక ఊరంటూ ఉన్నట్లు లేదు. చాలా చాలా దూరం నడిచిన తర్వాత, పిల్లలకు దూరంగా కనబడిన లైట్లు ఊరటనిచ్చాయి. చూడగా అది ఒక హైవే! పిల్లలు ఐదుగురూ అక్కడ నిలబడి వచ్చేపోయే వాహనాలను ఆపేందుకు చేతులు

ఊపుతుంటే, హైవే పోలీసు జీపొకటి వచ్చి నిలబడింది వాళ్ళ ముందు.

ఇంకేముంది, పిల్లలు ఐదుగురూ గందరగోళంగా జీపును ఎక్కారు. వాళ్ళ పుణ్యమా అని ఎంతో కాలంగా తప్పించుకొని తిరుగుతున్న మొరటాయన, కిడ్నాపర్లు అందరూ పోలీసుల చేత చిక్కారు!

"ఇంతకీ నీది వజ్ర శరీరమా, రామూ!? ముళ్ళు దిగవా, నీ ఒంట్లో?" రాముని అడిగారు పిల్లలు, పోలీసులు అందరూ. "ఏమీ లేదు; ఓసారి కాలుస్తాం కదా, కంప చెట్ల ముల్లులన్నీ మొనలు పోగొట్టుకొని, చాలా మొండిగా తయారవుతాయి. అవి మన ఒంట్లోకి అంత సులభంగా దిగవు.

అంతే కాదు- మనంఎప్పుడైనా ఒక ముల్లుని తొక్కామనుకోండి, అప్పుడు మన బరువంతా ఆ ముల్లు కొనకే తగులుకొని, అది మన శరీరంలోకి దిగేందుకు ఆస్కారం ఏర్పడుతుంది. అలాకాక, ఇట్లా ముళ్ళ 'పరుపు' ఒకటి ఉన్నప్పుడు, ఆ ముళ్ళన్నీ కలిసి మన బరువును పంచుకుంటాయి- ఏ ఒక్క ముల్లుమీదా మన శరీరంలో దిగబడగల్గేంత ఒత్తిడి ఏర్పడదు!

అందుకని కొంచెం జాగ్రత్తగా, కదలకుండా పడుకుంటే ఎవరైనా పడుకోవచ్చు ఈ ముళ్ళ పాన్పు మీద! నేను చదివిన మ్యాజిక్ పుస్తకంలో ఉన్నది ఈ మ్యాజిక్" అన్నాడు రాము నవ్వుతూ.



విను!

| | |
|---|---|
| నీళ్ళలోన మీను నెరమాంసమాశించి | నీళ్ళలో ఉన్న చేప ఎరను చూసి ఆశపడుతుంది; |
| గాలమందు జిక్కు కరణి భువిని | గాలానికి తగులుకొని నశిస్తుంది. |
| ఆశ దగిలి నరుడు అలాగు చెడిపోవు | అట్లాగే ఆశ అనే గాలానికి తగులుకొన్న మనిషి |
| విశ్వదాభిరామ వినురవేమ | కూడా నాశనం అవుతాడు. |




# పిట్ట చూపు

*'విహంగం' అంటే ఏంటో తెలుసుగా? పిట్ట. 'వీక్షణం' అంటే చూపు. వెరసి 'విహంగవీక్షణం' అంటే 'పిట్ట చూపు'. చాలా ఎత్తునుండి దేన్నయినా మొత్తంగా చూడటాన్ని విహంగ వీక్షణం అంటారు. ఇదిగో ఈ కథలో పక్షి చేస్తున్నదదే.. జాగ్రత్తగా చదవండి; ఆలోచించండి! సేకరణ: నారాయణ, కొత్తపల్లి బృందం.*

ఒకసారి ఓ వేటగాడు ఒక అడవిలోకి పోయి, అక్కడ వల పన్నాడు. తను ఓ మూలగా నక్కి కూర్చున్నాడు- 'ఏమైనా పక్షులో, జంతువులో అటుగా వచ్చి వలలో చిక్కకపోతాయా' అని.

అంతలో అటువైపుకు వచ్చిందొక బుజ్జి పిట్ట. వస్తూ వస్తూనే అది కాస్తా వలలో చిక్కుకున్నది. చూసేందుకది చిన్నదే, కానీ దాని తెలివి అమోఘం. అది ఏమీ కంగారు పడకుండా వలలో అలాగే కూర్చున్నది.

వేటగాడు సంతోషంగా దాని దగ్గరికి వచ్చి పట్టుకున్నాడు. "బుజ్జి పిట్ట బలే రుచిగా ఉంటుంది" అనుకున్నాడు. అయితే వాడు దాన్ని చంపబోగానే, బుజ్జి పిట్ట వాడితో

మాట్లాడింది- "వేటగాడా! ఓ సారి నామాట విను. నేను ఎంత చిట్టి పిట్టనంటే, నన్ను చంపి తిన్నంత మాత్రాన నీ ఆకలి చల్లారదు; నీ కడుపు నిండదు. దానికంటే నయం, నువ్వు నన్ను ఊరికే వదిలెయ్యి- అలా వదిలేస్తే, బదులుగా నేను నీకు అమూల్యమైన సలహాలు మూడు ఇస్తాను. అవి నీకు ఎనలేని మేలు చేస్తాయి. మొదటి సలహాను నేను ఇక్కడినుండే, నీ చేతిమీదే కూర్చొని- ఇస్తాను. రెండవదాన్ని నేను ఈ చెట్టు కొమ్మమీద కూర్చొని ఇస్తాను. మూడో సలహాను నేను ఆ చెట్టు మీద వాలి ఇస్తాను" అన్నది.

వేటగాడు ఒక్క క్షణం ఆలోచించాడు- "నిజమే, ఈ పిట్ట చాలా చిన్నది. దీన్ని తింటే కడుపేమీ నిండదు. దాని బదులు, ఇదేదో మంచి సలహాలు ఏవో ఇస్తానన్నది కదా, అవి తీసుకుంటే సరి. వాటి వల్ల నాకు ఎనలేని మేలేదో కలుగుతుందట కూడా! మరింకేమి?!" అని, పిట్టను వలనుండి తప్పించి చేతిలో పట్టుకున్నాడు.

పిట్ట అతనికి తన మొదటి సలహాను ఇచ్చింది: "ఎప్పుడైనాగానీ- సంభవం కాని మాటలు ఎవరు చెప్పినా సరే- నమ్మద్దు" అని.

"సరేలే" అన్నాడు వేటగాడు.

సలహా ఇచ్చేసాక పిట్ట ఎగిరి వెళ్ళి ఆ చెట్టు కొమ్మ మీద కూర్చున్నది. వేటగాడు ఇంకా మొదటి సలహా గురించి ఆలోచిస్తూండగానే తన రెండో సలహాను అందించింది: "జరిగిపోయినది ఏదైనా సరే- దాన్ని గురించి బాధపడద్దు" అని.

వేటగాడు సరేనన్నాడు, పరధ్యానంలోనే.

పక్షి వెంటనే అక్కడినుండి ఎగిరి వెళ్ళి ప్రక్కనున్న చెట్టు పైన వాలి, చెప్పింది- "చూడబ్బీ! నా పొట్టలో వంద గ్రాముల బంగారు ముక్క ఒకటి ఉంది. నువ్వు గనక దాన్ని దొరకపుచ్చుకొని ఉంటే, నువ్వొక్కడివే కాదు- నీ తర్వాత పది తరాల వాళ్ళు కాలు మీద కాలు వేసుకొని దర్జాగా బ్రతికి పోయేవాళ్ళు. నాకు నీ మీద ఎంత జాలిగా ఉందో చెప్పలేను- నువ్వు తొందరపడి నన్ను వదిలివెయ్యటం వల్ల, నీకు అందబోయిన సంపద ఆసాంతం పోయింది!" అని.

వేటగాడు నిర్ఘాంతపోయాడు . బాధ పడ్డాడు. "నువ్వు నన్ను మోసం చేశావు" అని మొత్తుకున్నాడు.



పక్షినవ్వి, వేటగాడితోఅన్నది- "చూడు, నీకు నేను ఇచ్చిన సలహాలు ఇంకా సరిగ్గా అర్థం అయినట్లు లేదు- 'జరిగిపోయింది ఏదైనా సరే, దాన్ని గురించి బాధ పడద్దు; ఎందుకంటే అట్లా బాధపడటం వల్ల ఏమాత్రం ప్రయోజనం లేదు' అని చెప్పాను. మరి, నువ్వు ఇప్పుడు ఎందుకు బాధపడుతున్నావు?

అంతేకాదు- 'సంభవం కాని మాటలు ఎవరు చెప్పినా నమ్మద్దు' అని చెప్పాను. ఇందాకే కదా, నువ్వు నన్ను పట్టుకున్నది?- నా బరువు వంద గ్రాములు ఉంటే నీకు తెలీకపోయేదా? ఇంత చిన్న నా కడుపులో వంద గ్రాముల బంగారం అసలు ఎట్లా చేరుకుంటుంది? అసంభవం కదా; మరి దాన్ని నమ్మకూడదు కదా?" అన్నది.

వేటగాడు సిగ్గు పడ్డాడు. "నిజమే. మంచి మాటలు విన్నంత మాత్రాన అవి మన ఆచరణలోకి వచ్చేస్తాయని లేదు. మంచిని ఆచరణలో పెట్టేందుకు కూడా ప్రత్యేకించి ప్రయత్నించాలి. నువ్విచ్చిన సలహాలను అమలు చేసేందుకు గట్టిగా ప్రయత్నిసాను ఇకమీద" అన్నాడు. "మరి నువ్విచ్చే మూడో సలహా ఏంటి?" ఉత్సాహంగా అడిగాడు పిట్టను.

"మంచి సలహాలు వినగానే వాటిని ఆచరణలోకి తెచ్చేసుకోవాలి- లేకపోతే ఇక సలహాలు రావు" అని చెప్పి తుర్రున ఎగిరిపోయింది పిట్ట. ✷




# నిధి-కుక్క

*'ఆశపడటం' అనేది మామూలు సంగతే- అందులో కొత్తేమీ లేదు. 'ఆశపడకపోవటం' మటుకు అలా కాదు! ఇదిగో, ఈ కథ చదివి చూడండి...*

*స్వేచ్ఛానువాదం: నారాయణ, కొత్తపల్లి బృందం*

బుద్ధుడు ఒకసారి ఓ గృహస్తు ఇంటి ముందు నిలబడి భిక్ష కోరాడు.

గృహస్తు ఇంట్లోవాళ్లందరూ బుద్ధుడి శిష్యులే. భగవానుడే నేరుగా తమ ఇంటికి వచ్చి భిక్ష కోరుతున్నాడని వాళ్లంతా ఆశ్చర్యంతోటీ, ఆనందంతోటీ ఉబ్బి తబ్బిబ్బయిపోయారు.

"రండి! రండి! లోపలికి రండి!" అని వాళ్లంతా బుద్ధుడిని ఇంటి లోపలికి ఆహ్వానించారు.

ఎవ్వరి ఆహ్వానాన్నీ కాదనడు బుద్ధుడు. వాళ్లింట్లోకి అడుగు పెట్టాడు.

ఇంటివాళ్ళు ఆయన్ని ఎక్కడ కూర్చోబెట్టాలని మల్లగుల్లాలు పడి, చివరికి ఇంట్లో లోపలి గదిలో ఉన్న పెద్ద మంచం మీదే కూర్చోమన్నారాయన్ని.

ఆ మంచం క్రిందే పడుకొని ఉన్నది, ఓ పెద్ద కుక్క! అది బుద్ధుడిని చూడగానే మొరగటం మొదలు పెట్టింది. దాదాపు ఆయన మీద పడి కరవబోయిందది!



ఇంటివాళ్ళు దాన్ని ఎంత వారించినా అది మొరగటం ఆపలేదు; అక్కడినుండి కదలలేదు.

బుద్ధుడు దాన్ని చూసి చిరునవ్వు నవ్వి, "నేనేమీ తీసుకుపోనులే, ఊరుకో" అన్నాడు. వెంటనే శాంతించింది ఆ కుక్క. వెళ్ళి మూలగా నిలబడి, గుర్రుమని చూస్తూ నిలబడ్డది.

ఇంట్లో వాళ్ళు బుద్ధుడికి చెప్పుకున్నారు- "క్షమించాలి స్వామీ! ఈ కుక్క నాలుగేళ్ళుగా మా యింట్లోనే ఉంది; ఎన్నడూ ఎక్కడికీ పోదు- ఎప్పుడూ ఈ మంచం క్రిందే పడుకొని ఉంటుంది. మిమ్మల్ని కాబట్టి ఇంతమాత్రం సహించింది గానీ, మరొకరినైతే ఈ గది దాపులకు కూడా రానివ్వదు- మిమ్మల్ని చూసిన సంతోషంలో మేం దాని సంగతే మరచాం" అని.

"మూడు బారువుల బంగారం బాగానే కట్టి పడేసిందే?" అని నవ్వాడు బుద్ధుడు.

"అదేంటి?" అని ఆశ్చర్యపోయిన గృహస్తుకు చెప్పాడు- "మీ నాన్న, తన జీవితం అంతా కష్టపడి మూడు బారువుల బంగారం కూడబెట్టాడు. ఎవ్వరూ ఎత్తుకుపోకుండా ఉండాలని, దాన్ని మీ ఇంట్లోనే- ఈ పెద్ద మంచం క్రింద- దాచాడు. అయితే ఆ సంగతి మీకెవ్వరికీ చెప్పకుండానే అకస్మాత్తుగా చనిపోవలసి వచ్చింది. ఇప్పుడు కుక్కలా ఆ బంగారాన్ని కాపలా కాస్తున్నాడు. ఆశాపాశం చాలా గట్టిది. జీవుల మనసును ఆవరించి

పట్టుకొని, పలు జన్మలకు కారణమౌతుందది. మనసును శుభ్రపరచుకోవటానికి, లోభం నుండి విముక్తి పొందటానికి అందరూ గట్టిగా ప్రయత్నించాలి. ఆశా పాశం పట్ల అప్రమత్తంగా ఉండాలి" అని ప్రవచించాడు.

ఆ తర్వాత గృహస్తు కుక్కను తరిమి, త్రవ్వి చూస్తే నిజంగానే మంచం క్రింద మూడు బారువుల బంగారం దొరికింది!

అతను లోభాన్ని దరిచేరనివ్వక, దాన్ని పూర్తిగా ప్రజోపయోగ కార్యక్రమాల కోసం వినియోగించాడు!

నవ్వండి!

**సాఫ్ట్ వేర్ సంబంధం!**

ఇల్లు కట్టిన తెలుగాయన అడిగాడు: 'గేట్స్' కీ, 'విండోస్' కీ ఏం సంబంధం?

కంప్యూటర్ల ప్రపంచంలోని యువకుడు చెప్పాడు: సాఫ్ట్ వేర్ సంబంధం!

**లంచావతారం!**

కుర్ర ఆఫీసరుతో ముసలి అటెండరు చెబుతున్నాడు: "అట్లా బోర్డు పెట్టడం బావోదు సార్! 'బహుమతి లేనిదే లోనికి రాకూడదు' అని బోర్డు రాస్తే మరీ తెగించినట్లు ఉంటుందేమో!" అని.

**అజాగ్రత్త!**

కొత్తగా ప్రాక్టీసు పెట్టుకున్న సైకియాట్రిస్టు ఉత్సాహంగా ముందుకు వంగి అడిగాడు:

"అయ్యా, మీ సమస్య ఏంటో చెప్పండి!" అని,

పేషంటు: నా ముందున్నవాళ్లను కొరికేద్దామనిపిస్తుందండి!

సైకియాట్రిస్టు: ఆఁ.. ఐతే ఇట్లా నా ప్రక్కకు వచ్చి కూర్చోండి, ముందు ఆ కుర్చీలోంచి లేవండి..

# కాటో-కకాలా

యువకెరటాలు

*నిర్వహణ: సౌమ్య, పుస్తకండాట్‌నెట్.*



పసిఫిక్ మహాసముద్రం మధ్యలో 176 ద్వీపాలతో కూడిన టాంగా అనే దేశం ఉంది. 2009 లో ఈ దేశాన్ని సునామీ ముంచెత్తింది. అప్పుడు అమెరికాలో పనిచేస్తున్న కాటో అనే అమ్మాయి టాంగాలోని తన బంధువుల గురించి ఖంగారు పడి వాళ్లకి ఫోన్ చేసినప్పుడు, అన్నింటికంటే ముందు వాళ్ళు బాధపడ్డ విషయం - "మా పుస్తకాలన్నీ తడిసి పాడైపోయాయి." అని. అలా, "మాకు కొన్ని పుస్తకాలు పంపగలవా?" అని బంధువుల నుండి వచ్చిన విజ్ఞప్తి ని విన్నాక, టాంగా దేశంలో ఇప్పటి దాకా ఒక "పబ్లిక్ లైబ్రరీ" అన్నది లేదన్న విషయం తట్టింది కాటోకు. "నా దేశంకోసం నేనొక చిన్న లైబ్రరీ కడతాను" అనుకుంది కాటో. ఆమె కథే ఇప్పుడు చెప్పబోయేది.

కాటో పూర్తి పేరు కాటో-కకాల. అమెరికా దేశంలోని అలాస్కా ప్రాంతంలో టాంగా దేశస్థులకి పుట్టింది. అయితే, చిన్నప్పుడే తల్లీ, తండ్రీ విడిపోవడంతో, టాంగాలో తన అమ్మమ్మ దగ్గర పెరిగింది. పెద్దయ్యాక చదూకోడానికి అమెరికా వచ్చి, వివిధ కార్యక్రమాల్లో చురుగ్గా పాల్గొంటూ, మంచి పేరు తెచ్చుకుని అక్కడే స్థిరపడింది. ఇలా జీవితం కొనసాగుతూ ఉండగా, 2009 లో టాంగా దేశంలో ఒక పెద్ద సునామీ వచ్చింది. దీని వల్ల తన వాళ్లకి ఏమైందో అని ఫోన్ చేసినప్పుడు మొదలైంది అసలు కథ- తన దేశానికి ఒక లైబ్రరీ నిర్మించాలన్న కల!

అలా అనుకున్నాక, ఒకసారి ఆమె అమెరికాలో తన విశ్వవిద్యాలయానికి వెళ్ళింది. అప్పుడు అక్కడ లైబ్రరీ వారు ఉచితంగా పుస్తకాలు పంపిణీ చేస్తున్నారు అని తెలిసిందామెకు. వెళ్లి ఓ నాలుగు పుస్తకాలు తీసుకుంది. తన దేశంలోని గ్రంథాలయం కోసం పుస్తకాల సేకరణ అట్లా

మొదలైంది. ఈ ప్రయత్నం గురించి తెలిసి, చాలా మంది వ్యక్తులు స్పందించారు. కొన్ని సంస్థలు కూడా సహకరించడం మొదలుపెట్టాయి. అలా, ఇప్పుడు ఎన్ని పుస్తకాలు పోగు చేసిందో తెలుసా? 35000 పుస్తకాలు! మరి ఇన్ని పుస్తకాలు జాగ్రత్త చేయాలంటే మాటలా?? బోలెడు సొంత డబ్బు ఖర్చు చేసి, వాటిని ఇన్నాళ్ళూ జాగ్రత్త చేసి, ఇప్పుడు వాటినన్నిటినీ తన దేశానికి తరలించడానికి కావాల్సిన నిధులు సేకరించింది!

ఈ లైబ్రరీ కోసం దేశం నడిబొడ్డు అనదగ్గ ఒక ద్వీపాన్ని ఎంచుకుని, దానికి Northern Lights Library అని పేరు పెట్టింది. భవిష్యత్తులో దేశంలోని ఇతర ప్రాంతాల్లో కూడా ఈ లైబ్రరీ శాఖలు తెరవాలని ఆమె ఆలోచన. మరొక ఇరవై సంవత్సరాల్లో ఈ లైబ్రరీ ఒక పెద్ద విద్యాసంస్థ కావాలని ఆమె కోరికట!



"నేను చేసే పనిని గురించి చాలా మందికి సందేహాలు ఉన్నాయి కానీ, గొప్ప కలలు కనడం, ఒక ప్రణాళిక ప్రకారం పని చేసుకుని వాటిని సాధించుకోవడం నాకు ఇష్టం" అంటుంది కాటో. ఇది కాక, ఆమెకి డాన్స్ చేయడం, బొమ్మలు గీయడం కూడా ఇష్టమట. ప్రస్తుతం మళ్ళీ చదువుకోవడం మొదలుపెట్టి, డిగ్రీ చదువుతోంది. త్వరలో న్యాయశాస్త్రం చదవాలి అనుకుంటోందామె.

తన దేశం కోసం ఒక లైబ్రరీ నిర్మించుకుంటున్న ఈ యువతి కథ స్ఫూర్తివంతంగా లేదూ? మా చిన్నప్పుడు మా క్లాసులో ఉన్న వాళ్ళం కలిసి, నెలకి తలా ఐదు రూపాయలు వేసుకుని, వార్తా పత్రికల లైబ్రరీ ఒకటి రూపొందించుకున్నాము. తరువాత అది చూసి స్కూల్లో వేరే తరగతుల వాళ్ళు కూడా ఆ ప్రయత్నం చేసారని విన్నాము: ఆ సంగతి గుర్తు వచ్చింది నాకు, ఈ కథ చదివితే. అందరం దేశాలకి లైబ్రరీలు కట్టనక్కరలేదు కానీ, మన కోసం, మన చిన్న గుంపుల కోసం ఇలాంటి ఉపయోగకరమైన పనులు ఏవైనా చేసుకోవచ్చు కదా, ఏమంటారు? 

# సమీక్ష

| *కొత్తపల్లి-61 పై ఒక సమీక్ష* | *సమీక్షకులు: రాజా పిడూరి.* |
|---|---|

ఈ సారి కొత్తపల్లిలో ప్రముఖంగా చెప్పుకోవాల్సింది సంపాదకీయం. చాలా గొప్పగా ఉంది. నసీరుద్దీన్ కథని చెప్పిన తీరూ, దానిని అమెరికా సంగతికి అన్వయించడమూ ఎంతో బాగున్నాయి. మౌలికంగా మనుషుల్లో ఉండే గుణాలే దేశాల స్థాయిలో మనకి కనిపించే మంచి చెడ్డలుగా రూపు కడతాయన్న గొప్ప తాత్త్విక సత్యాన్ని పరోక్షంగా తెలియజేసిందీ సంపాదకీయం. ప్రతి సంచికనీ సంపాదకీయం కోసమే తెప్పించుకొని ఆవురావురుమని చదివే పాఠకులు ఏర్పడతారేమో బహుశా - ఇలాంటివి ప్రతి నెలా వ్రాస్తే.




ఈ కొత్త పల్లి సంచిక గురించి ప్రముఖం గా చెప్పుకోవాల్సిన ఇంకో విషయం - కొంచెం బాధ కల్గించేదే - అచ్చుతప్పులు. మునపటి సంచికలలో అసలు అచ్చు తప్పులు లేవని చెప్పలేమేమో కాని, ప్రస్తావించాల్సినంతగా అవి ఎప్పుడూ లేవేమో! ఈ సంచికలో కూడా, అక్కడక్కడా కన్పించిన వాటిని "పోనీలే" అని సరిపెట్టుకోవచ్చునేమో కానీ - విషయ సూచికలో కథల పేర్లలో, ఇంకా ఈ సంచిక లో ప్రతి పేజీలోపైన ముద్రించిన బుల్లి మకుటం లోనే అచ్చుతప్పులు ఉండటం చూసి బాధ పడకుండా ఉండలేం.

లోపల బొమ్మల విషయానికొస్తే ఫర్వాలేదని మాత్రమే అనగలమేమో... ముఖచిత్రం బాగుంది. నీతి చంద్రికలో మండే పుల్లల్ని కాకులు చేతుల్తో పట్టుకున్నట్టు వెయ్యడం బాగాలేదు (కథలో ముక్కు న కరచుకొన్నట్టు స్పష్టం గా ఉన్నా).

రిత్య వ్రాసిన కథలో అద్భుతాలు ఎక్కువయిపోయినట్టు ఉన్నా కథ తమాషాగా ఉంది. పనినైనా, ఆటనైనా ఆనందిస్తూ ఉంటే ఎప్పటికో అప్పటికి విజయం తథ్యం అన్న విషయాన్ని చక్కగా చెప్పింది శ్రీరాం

వ్రాసిన కథ (చెస్ విజేత ).

పెద్ద వాళ్ళకి అసలు సమస్యలుగానే అనిపించని విషయాలు కొన్ని చిన్న పిల్లలకి ఎలా సమస్యలుగా కనిపిస్తాయో ప్రవీణ్ తన కథ (స్నేహితులు) ద్వారా చక్కగా చెప్పాడు.

అమరేశ్వరి వ్రాసిన ' ఉంగరం పోయిన కథ' రాధ వ్రాసిన 'వ్యక్తిత్వం' కథలు కొంచెం పెద్దవాళ్ళ కథల్లాగానే అనిపించినా బాగున్నాయి. పిల్లల కోసం అక్కర పడే చాలా మంది పెద్దవాళ్ళు కూడా కొత్తపల్లి శ్రద్ధగా చదువుతారు కాబట్టి ఇలాంటి కథలు ఎన్ని వేసినా ఫర్వాలేదనిపిస్తుంది.

జంతువులూ మనుషులూ ఒకరినొకరు ప్రేమగా చూసుకోవడం, కష్టం వస్తే ఆదుకోవడం- ఇలాంటి హృద్యమైన విషయాలు చక్కగా చెప్పి హాయిగా చదివించిన కథలు ఈ సంచికలో నాలుగు ఉండడం విశేషం ! (నాగజయంత్ - మంచి ఏనుగు, సుష్మ - బొమ్మకి కథ, జానకి ; ఒంటె -కుందేలు, రాధ - రాము చేసిన తప్పు)

కొద్ది బుద్ధులున్న పెద్దవాళ్ళకి బుద్ధి చెప్పే కథలు - 'నీవు నేర్పిన విద్యయే', 'దురాశ పిల్లి '. ఇలాంటి కథలు చదివి కొందరైనా పెద్దలు మారతారేమో ! ' ఉమ్మేస్తే మంటలు' కథ బాగుంది; కానీ ఇంద్రజాలం కథలు ఎప్పుడూ మూఢ నమ్మకాల చుట్టూ నే తిరగాలా అన్పిస్తోంది. ఇలాంటి కథలు ఇప్పటికే చాలా చదివేసి ఉండడంవల్లనేమో ! ఏదైనా శాస్త్రీయ విషయాన్ని ఆసక్తి కలిగించే ఇంద్రజాలం సహాయంతో విపులీకరిస్తూ కథలు ప్రచురిస్తే బాగుంటుందేమో ! సుష్మ వ్రాసిన 'మూఢ నమ్మకాలకు స్వస్తి' పెద్దదైనా బాగానే చదివించింది.

'సామెత ఎలా వచ్చింది' అనేది ఒక శీర్షికగా ప్రతినెలా వస్తే బాగుంటుంది. ద్విజేంద్ర జోకులు బాగా నవ్వించాయి. 'మంచి పుస్తకం' శీర్షిక కింద వేస్తున్న పుస్తకాలు చాలా విలువైనవి. బహుశా ఇప్పుడు ఎక్కడా దొరకవేమో (దొరుకుతాయా?) కానీ, ఇలాంటి పుస్తకాలు ఒకప్పుడు ప్రచురితమయ్యాయని తెలుసుకోవడం కూడా ఆనందం! సంతోషం!!

మొత్తం మీద ఈసారి కొత్తపల్లి ఎప్పటిలాగే ఓ కలగూర గంప! మిశ్రమ భావనల కాత!

# చిలిపి ప్రశ్నలు -తిక్క జవాబులు

*నిర్వహణ: శ్రీవివియస్ మూర్తి, చొదిమెళ్ళ, పశ్చిమగోదావరి జిల్లా.*

1. కార్పొరేట్ స్కూలు ప్రిన్సిపాలు నిజాయితీగా ఏమని చెప్తాడు ?

"మీ అబ్బాయికి చదువొస్తుందని హామీ ఇవ్వలేను గానీ, ర్యాంకు వస్తుందని మటుకు హామీ ఇస్తున్నాను" అంటాడు!

2. యల్ కే జీ లో పిల్లాడిని చేర్చటానికి వచ్చిన తల్లి దండ్రులను హెడ్మాస్టరు ఏమడిగాడు?

"ఐ ఐ టీ యల్ కేజీ యా, ఆర్డినరీ యల్ కే జీ యా?" అని!

3. అన్నిటికంటే పెద్ద సీలింగ్ ఫ్యాను ఎక్కడ ఉంటుంది?

హెలికాప్టరు పైన!

4. వినియోగదార్ల హక్కుల సంఘం ప్రెసిడెంటు డాక్టరును ఏమడుగుతాడు?

ఆపరేషను చేసిన తర్వాత బిల్లుతో పాటు గ్యారంటీ కార్డు ఇమ్మంటాడు!

5. బట్టతల వలన లాభం ఏమిటి?

తల దువ్వుకునే శ్రమ తప్పుతుంది!

6. ప్రాణం లేకపోయినా 'డెడ్' అయ్యేదెవరు?

ఫోను!

7. వర్షం పడుతున్నప్పుడు వెంగళప్ప ఏం చేస్తాడు?

గొడుగు వేసుకొని మొక్కలకు నీళ్ళుపోస్తాడు!

**ముద్రిత ప్రతుల వెల:** ప్రతి ఒక్కింటికి: 25 రూ.
12 పుస్తకాలకైచందా: **రూ. 300/-**

"కొత్తపల్లి ట్రస్టు" పేరిట యంవో/డిడిని ఈ చిరునామాకు పంపండి: కొత్తపల్లి ట్రస్టు, యంఆర్‌వో ఆఫీసు దగ్గర, చెన్నేకొత్తపల్లి, అనంతపురం జిల్లా- 515101, ఆంధ్రప్రదేశ్.

బ్యాంకు అక్కౌంటు వివరాలు:

"Kottapalli Trust", A/c No. 0138101018809 (savings), Canara Bank, Chennekothapalli. IFSC: CNRB0000138

ఫోన్లు: 08559 240222, 7702877670
ఇ-మెయిలు: team@kottapalli.in



**<u>కృతజ్ఞతలు:</u>** ప్రభుత్వ ప్రాథమికోన్నత పాఠశాల- తరాలపల్లి వారికి, మ్యాజిక్ కథల రావు గారికి, రాధా రాజశేఖర్ -సోమి రెడ్డి గార్లకి, రిషీవ్యాలీ బడి వారికి, మన లైబ్రరీ జహీరాబాదు వారికి , చిలిపి ప్రశ్నలమూర్తిగారి కి, కంప్యూటర్లలో లైనక్సు వ్యవస్థను చక్కగా అందిస్తున్న ఉబుంటు వారికి, జింప్, అడాసిటీ తదితర ఓపెన్ సోర్సు సాఫ్టువేరు నిర్మాతలకు, ఇంకా పేర్లు రాయని అనేకమందికి.. ఇక ఈ ప్రతి ముద్రణకు అవసరమైన మొత్తం రూ. 33,000 లను ఉదారంగా ఇచ్చిన పూర్వ విద్యార్థి మహబూబ్ సుభాన్‌కు ప్రత్యేక కృతజ్ఞతలు.

పిల్లల్లో సృజనాత్మకత సహజం. కథలు, ఆటలు, పాటలు, బొమ్మలు దానికి ఊతాన్నిస్తాయి. మాతృభాషలో ఇష్టంగా చదవటం, తేలికగా రాయటం వస్తే అటుపైన అన్ని శాస్త్రాలూ సులభంగా వంటపట్టుతాయి-నిజం! అందుకని మీ పిల్లల్లో ఉన్న కాల్పనిక శక్తికి పదును పెట్టండి. వాళ్లను కథలు రాసేందుకు, పాటలు పాడేందుకు, బొమ్మలు వేసేందుకు ప్రోత్సహించండి. వాళ్ళ రచనల్ని మాకు పంపండి. కావాలనిపిస్తే మీరే ఇలాంటి పత్రికనొకదాన్ని మొదలు పెట్టండి- ఎలాగైనా సరే- పిల్లలు పెద్దవాళ్లయ్యేలోగా వాళ్ళు చాలా చాలా తెలుగు కథల్ని చదివేలా, రాసేలా చేయండి. మీ పిల్లలకు ఈ పత్రికలోని కథలు నచ్చుతాయనే మా నమ్మకం- వీటిని వీలైనంత మందితో పంచుకోండి. మీరు రాసిన పిల్లల కథలు ఏమైనా ఉంటే పనిగట్టుకునైనా సరే, మాకు పంపండి. వీలు చేసుకొని ప్రచురిస్తాం.

మంచి పుస్తకం:

## బంగారు దీవి

*రాబర్ట్ లూయీ స్టీవెన్సన్* *సంక్షిప్త అనువాదం: ఎస్.మధుబాబు*

ఎక్కడో సముద్రం మధ్యలో ఓ దీవి. దాని కడుపులో లెక్కకు మించినన్ని నిధులు. బంగారం, వెండి, రత్నాలు... ఆ నిధులకు సంబంధించిన చిత్రపటం ఒకటి ఓ పిల్లవాడికి దొరికింది. అతనికి తోడుగా ఓ డాక్టరుగారు, ఓ జమీందారుగారు ఓడ ఎక్కి బయలుదేరారు.

ఓడ కెప్టెనుగా ఎవరిని పెట్టుకోవాలి? ఎవరిని నమ్మాలి?

ఏమో.. బాగా వెతకాలి. నీతి గల నావికులను వెతికి పట్టుకోవాలి.

అయినా అట్లా జరగలేదు: వీళ్ళు నమ్మిన వారిలోనే కొందరు సముద్రపు దొంగలు! వాళ్లంతా కూడా నావికులైపోయి ఓడలో చేరుకున్నారు.

ఇప్పుడు వాళ్ళు లేకుండా నిధి దొరికే వీలు లేదు!

మరి వాళ్లు ఉండగా నిధి దొరికీ ఏం ప్రయోజనం?!

కుట్రలు- కుతంత్రాలు- హత్యలు- సాహసాలు- ఊహించని మలుపులు-ఊపిరి సలపనీయని ఉత్కంఠ!

పీకాక్ వారి సంక్షిప్త అనువాదం చదవండి; తర్వాత నండూరి రామ్మోహనరావుగారి అనువాదం చదవండి! అటుపైన ఆంగ్ల మూలాన్ని చదవకుండా ఉండగలరేమో చూడండి!

నాడూ, నేడూ, ఏనాడూ చదవాల్సిన పుస్తకాల్లో ఇది ఒకటి!

**బంగారు దీవి**

పీకాక్ క్లాసిక్స్ వారి ప్రచురణ

వెల: రూ 40, పేజీలు: 88

ఫోను: 23063729, 66660197



# ఫస్టు ర్యాంకు

"మావాడికి ఎప్పుడూ ఫస్టు ర్యాంకే వస్తుంటుంది" చెప్పింది మణిమాలమ్మ సంతోషంగా.

"అవునా! అయితే బాగా చదువుతాడన్నమాట వీడు!" మురిపెంగా అంటూ నానిగాడిని దగ్గరికి తీసుకున్నాను నేను.

మణిమాలమ్మ అన్నది- "ఎప్పుడూ ఏదేదో చెబుతూనే ఉంటాడు. నేనేమో ఇంగ్లీషు చదువుకోలేదుగా, అందుకని ఏమీ అర్థం అవ్వదు నాకు!" అని.

"ఎన్నో క్లాసురా, నువ్వు?" అడిగాను.

"యుకెజి!" అన్నాడు నానిగాడు ముద్దు ముద్దుగా.

"బాగుంది బాగుంది. మరి నీకు 'అ ఆ ఇ ఈ'లు వచ్చా?" అడిగా.

"రావు!" అన్నాడు నాని గొప్పగా, తల అడ్డంగా ఊపుతూ.

"ఓహో! మరి ఎబిసిడిలు వచ్చే ఉంటాయి- చెప్పు" అన్నాను.

"గడ గడ గడ..." చెప్పేసి గాలి పీల్చుకున్నాడు వాడు.

"భలే! భలే!" మెచ్చుకున్నాను. "ఇంకా ఏమొచ్చురా, నీకు? మీకు రోజూ ప్రార్థన ఉంటుందా, మార్నింగ్ అసెంబ్లీ?" అడిగాను.

"ఓ!" తల ఎగరేశాడు వాడు.

"మరయితే, మీ ప్రేయర్‌లో ప్రతిజ్ఞ చేస్తారు కదా, అది చెప్పు, చూద్దాం!" అన్నాను నేను, 'వచ్చో, రాదో' అని కొంచెం అనుమానపడుతూనే.

"మా పేయర్లో పతిగ్న ఉండదు!" అన్నాడు వాడు.

"అదేరా, ప్లెజ్- ప్లెజ్ ఉంటుంది కదా, ఇండియా ఈజ్ మై కంట్రీ..." అందించా.

"పెజ్ అంటే...అదుండదు మాకు. వేరేది ఉంటుంది" అన్నాడు వాడు.

"చెప్పు చెప్పు- నేనూ నేర్చుకుంటాను" ఉత్సాహపరచాను.

చెయ్యి ముందుకి చాపి, మళ్ళీ ఓసారి గడగడా చెప్పాడు- ఐ, దస్టూడెంట్ ఆఫ్ ***, ఐ ప్రామిస్ దట్ ఐల్ లీడ్ మై లైఫ్ ఇన్ ఎ ట్రూత్ఫుల్ వే. ఐల్ ఆల్వేస్ స్పీక్ ఇన్ ఇంగ్లీష్ ఇన్ ద స్కూల్ క్యాంపస్ అండ్ ఔట్సైడ్ అల్సో..." అని.

"వావ్!" మెచ్చుకున్నాను. "భలే చెప్పావురా! దీని అర్థం ఏంటో తెలుసా, నీకు?" అడిగాను మణిమాలమ్మని.

"అర్తం తెలీదు" అన్నాడు నాని.

"ఇంట్లోనూ, బయటా, ఇంకా స్కూల్లోనూ అంతటా నువ్వు ఇంగ్లీషులోనే మాట్లాడతావట!" నవ్వాను.

వాడూ నవ్వాడు. మణిమాలమ్మ కూడా నవ్వి- "ఇంగ్లీష్ మీడియం కదా, అందుకని" అంది.

"ఇంక నువ్వూ వాడూ మాట్లాడుకునేందుకు వీల్లేదన్నమాట!- నీకేమో ఇంగ్లీషు రాదు; వాడేమో తెలుగులో మాట్లాడకూడదు. బానే ఉంటుందిక, మీ జీవితం!" అన్నాను నేను, నవ్వుతూ.

మణిమాలమ్మ కూడా నవ్వింది. అయితే ఈసారి ఆ నవ్వులో కాస్తంత బెరుకు ఉందేమో అనిపించింది నాకు.

Published by Narayana for Kottapalli Trust, Near M.R.O.Office, Chennekothapalli-515101, Ananthapur District, AP. Ph: 7702877670 mail: team@kottapalli.in and printed at Mudrica Offcet Printers, Vijayawada,Phone:08662579129